# వేదనా మధ్యాక్కరలు







జి.వి. సుబ్బారావు

# వేదనా మధ్యాక్కరలు

పద్యకవిత

జి.వి. సుబ్బారావు

ఏప్రిల్, 1996
I Edn.
వెల ః 25 రూ.

ప్రతులకు ః జి.వి. సుబ్బారావు
10-1-18/24, శ్యామ్‌నగర్,
హైద్రాబాద్ - 500 004.

ముద్రణ ః ప్లానోగ్రాఫర్స్, చిరాగ్ ఆలీ లేన్
హైద్రాబాద్ - 500 001.
ఫోన్ ః 203390, 202717

# VEDANA MADHYAKKARALU

A Poetic Compilation
by
**G.V. SUBBA RAO.M.A.,**

APRIL, 1996

Price : **RS. 25/-**

For Copies : **G.V. SUBBA RAO**
10-1-18/24, Shyamnagar,
Hyderabad - 500 004

Printers : **PLANOGRAPHERS**
Chirag Ali Lane,
Hyderabad - 500 001
Ph. : 203390, 202717

# అంకితము

## అమ్మ, నాన్నలకు

## కీ.శే. శ్రీమతి గుఱ్ఱప్పుడి సుబ్బలక్ష్మమ్మ,
## కీ.శే. శ్రీ గుఱ్ఱప్పుడి రామసుబ్రహ్మణ్యం గారలకు

అంకితమ్మొనరింతు, రస మయాత్మక, రమ్యకావ్యమ్ము -
చంకనెత్తుచు పెంచి, నన్ను చనుబాల కుడిపి, పోషించి,
జంకు దీర్చిన తల్లి; కెల్ల చదువు, సంధ్యలు నేర్పి, జీవి
తాంకమున వెలుంగ చేసినట్టి - తండ్రికిని, - ప్రేమమున!

నా రాము కథ వినుచు, అధునాతనమ్మనుచు, దీవించు!
నా రాగలతల పుష్పించు, నానా ప్రసూన సౌరభము,
లా రాధ్య దైవమ్ము - దశరథాత్మజుడే, క్రోలు నంచు -
పారవశ్యము నొందు, పితల పాదాంకితమ్ము లీ కవిత!

తల్లిదండ్రుల ప్రేమ నెట్లు ధరలోన మూల్యమ్ముకట్ట?
ఉల్లమ్ములో పొంగు నూహ, లుజ్జ్వల ప్రతిభాధ్వ మందు,
వెల్లువై, రసరమ్య ఝురుల, - వినుతు, మధ్యాక్కరల - తప
మెల్ల - కవితగ, - పితౄణ, మీరీతి, తీర్తు నేననుచు!



కీ.శే. శ్రీమతి గుఱ్ఱప్పడి సుబ్బలక్ష్మమ్మ,
కీ.శే. శ్రీ గుఱ్ఱప్పడి రామసుబ్రహ్మణ్యం

# తొలిపలుకు

నా రచనా వ్యాసంగం పద్యకవిత్వంతో మొదలై, తర్వాత వచన కవిత్వం వైపు మొగ్గుచూపి, తుదకు పద్యకవిత్వంలోనే కొనసాగింది. నా వచన కవితా సంకలనాలు - రెండు - 'క్రాస్ రోడ్స్' (11/94) - 'శిల్పాశ్రువులు' (1/95) - ప్రచురింపబడ్డాయి ముందుగా. ఇది నా తొలి పద్యకవితా సంకలనం.

మాత్రాగణబద్ధమైన జాతులలో, మధ్యాక్కరలపై మక్కువెక్కువ నాకు. ఆదికవి, నన్నయ, మధ్యాక్కరలను భారతంలో ప్రయోగించినా, కవిసమ్రాట్టులు, గురువర్యులు, విశ్వనాథ సత్యనారాయణగారు వీటిని - శతకరూపంగా, రామాయణ కల్పవృక్షంలో - విరివిగా వాడి, తమ అనన్యప్రతిభతో, వాటికొక అపూర్వ గౌరవ స్థానం కల్పించారు.

ఆ గౌరవంతో, ఆ మక్కువతో, నా ఊహాగానాలను కొన్నిటిని మధ్యాక్కరలలో వ్రాస్తూవచ్చాను. నా జీవుని వేదన, నా హృదయంలో ఆర్తి - కొంత విషాదచ్ఛాయలతో, కొంత భక్తి తత్త్వంతో - ఈ కవితలో గూడు కట్టాయి. వేదనా మధ్యాక్కరలుగా రూపొందాయి. ఇందులో వస్త్వైక్యం, క్రమ పరిణామంలాంటి - వేమీ లేవని మనవి. కేవలం భావావేశంతో, రసార్ద్రచిత్తంతో పరువులెత్తిన కవితా స్రవంతియిది.

ఇందులో 'కవితా తపస్సు', 'రామాయణం' 'సీతామనః శోక గాధ' - లాంటి పదాలు, పదేపదే, నా మధ్యాక్కరలలో చిక్కగా చోటు చేసుకొన్నాయి. అవి - 'శ్రీ సీతామనోరామాయణము' - అన్న కావ్యానికి నాంది, పూర్వరంగం, ప్రస్తావనలుగా - ఆంగ్ల పరిభాషలో - 'Curtain Raiser'- గా సూచింపబడ్డాయి. అంతే!

లాక్షణికులు, మధ్యాక్కరలకు, 4వ గణము మొదటి అక్షరం యతి స్థానంగా నిర్దేశించినా, నన్నయ, 5వ గణము మొదటి అక్షరం, యతి స్థానంగా ప్రయోగించడం జరిగింది. రచనా సౌలభ్యం కోసం - ఈ వేదనా మధ్యాక్కరలలో ఈ రెండు యతి భేదాలు పాటించాను. నన్నయగారి యతి, ననుసరించిన వాటికి* గుర్తు ఉంచాను. ఈ రచనా వైవిధ్యాన్ని, పఠితలు సహృదయంతో స్వీకరిస్తారని నమ్ముతున్నాను.

సహృదయంతో, నా ప్రార్థనను మన్నించి, పరిచయ వాక్యాలుగా, "కృత్యాద్యవస్థ"ను ప్రసాదించిన విద్వత్కవులు, బ్రహ్మశ్రీ ఉత్పల సత్యనారాయణాచార్యుల వారికి నా హృదయపూర్వక ధన్యవాదములు.

ఈ ఊహాగానాలను, రసికులు, సహృదయులైన పాఠకులు ఆదరించి, అభిమానిస్తారని ఆశిస్తూ సెలవు తీసుకొంటాను.

హైద్రాబాద్.
ఏప్రిల్, 1996

భవదీయుడు,
జి.వి. సుబ్బారావు

[ ఉత్పల సత్యనారాయణాచార్య ]

# కృత్యాద్యవస్థ

శ్రీరాముడు మర్యాదా పురుషోత్తముడు. సకల సద్గుణాలకు "సతత సంవాసవసతి" ఆయన ఒక్కడే. శ్రీరాముడు ధర్మమర్యాదలను పాలించాడు. ధర్మఫలం శాంతి. అధర్మ ఫలం అశాంతి. చిత్తశాంతికి శ్రీరాముణ్ని ఆరాధిస్తాము. లోకకల్యాణకరమైన ధర్మాన్ని చాటే నెపంతో శ్రీరాముణ్ని కీర్తిస్తాము.

స్వర్గం నుంచి చాలా శ్రమపడి భూలోకానికి వచ్చిన సరస్వతీదేవి "రఘుపతి గుణగ్రామశ్లాఘా సుధామయ దీర్ఘిక"లో హాయిగా స్నానమాడి తన బడలిక తీర్చుకొన్నదని వర్ణించాడు. మహాకవి జయదేవుడు. వాల్మీకి రామాయణం ఒక అమృత సరస్సు.

"తాజేసిన తండ్రి యాజ్ఞయును జీవుని వేదన రెండు నేకమై నా సకలోహ వైభవ సనాథము నాథకథన్ రచించెదన్" అన్నారు కవిసమ్రాట్ విశ్వనాథ రామాయణ కల్పవృక్ష కృత్యాదిలో. ఆ జీవుని వేదన ఎలాంటిదో విశ్వనాథ చెప్పలేదు. ఆ వేదనకు శ్రీ జి.వి. సుబ్బారావుగారు ఈ కావ్యంలో అక్షరాకృతిని కలిగించారు. శ్రీ రామాయణం రసవంతంగా రచించి తమ జీవితానికి ధన్యత చేకూర్చుకోవాలని విశ్వనాథ వలెనే తమ సకలోహలను రామకథ పైననే ఉంచారు.

ఎవరి వ్యక్తిత్వ మహిమనైనా మనం స్వీకరించి వారికి నతమస్తకులం కావడానికి వారి ఆధ్యాత్మిక సంస్కార ప్రభావమే కారణమవుతుంది. సంస్కారాల మూలంగా కొద్దిగానో, గొప్పగానో తదనుకూల పరివర్తన జీవితంలో లాగానే కావ్య ప్రకృతిలోను జరుగుతుంది. శ్రీ సుబ్బారావుగారి హృదయంలో జరిగిన పరివర్తనకు చెందిన ఆవర్తవివర్తాలే ఈ పద్యాలు.

శ్రీ విశ్వనాథ శ్రీ పుట్టపర్తి మున్నగు మహామహుల కున్నంత రచనా ప్రావీణ్యం తనకు లేకపోయెనే అనే వేదన వీరికున్నది. "ప్రాంశులభ్యే ఫలే లోభాదుద్బాహు రివ వామనః" అని రఘువంశ కృత్యాదిలో కాళిదాసంతటి వాడే వాపోయాడు. అయితే శ్రీ సుబ్బారావుగారికి ఆ యిద్దరి కవులకున్నంత రసహృదయమున్నది. అంతేకాదు, పోతనగారి వలె శ్రీ కైవల్యపదంబు చేరుటకునై చింతించే వేదనాధార ఆకంఠంగా ఆప్రాణంగా ఓత ప్రోతమై ఉన్నది.

దేశ విదేశాలు పర్యటించి, విభిన్న సంస్కృతులను పరిశీలించిన విజ్ఞాని శ్రీ సుబ్బారావు గారు. ప్రపంచ సాహిత్యాన్ని అధ్యయనించి, కావ్య పరమార్థమేదో నిశ్చయించుకొన్న మనీషి

శ్రీ సుబ్బారావుగారు. క్రాస్‌రోడ్స్, శిల్పాశ్రువులు మొదలైన అత్యాధునిక కవితలను వెలయించి 'అమెరికన్ ఎంథాలజీ ఆఫ్ పొయిట్రీ'లో (Published by The National Library of Poetry, Mary Land, U.S.A.) ప్రశస్తికెక్కిన కవి శ్రీ సుబ్బారావుగారు. అలాంటి శ్రీ సుబ్బారావుగారికి ఉత్పన్నతాపరంగాను అధ్యాత్మపరంగాను శ్రీ మద్రామాయణం ప్రాణపదమయింది. తానొక రామాయణం రచించాలనే తహతహ కలిగింది. తన స్థితి ఎలాంటిదో తెలుపుకొన్నారు. తన వేదనలను బహు విధాలుగా వెల్లడించుకొన్నారు. ఒక్కొక్కచోట తన వేదనా పరిధిని దాటి తన దృష్టిని విస్తృతపరిచిన సందర్భాలు కూడా ఈ కావ్యంలో కనిపిస్తాయి. అందులోనే శ్రీ సుబ్బారావుగారి వ్యక్తిత్వ ప్రతిష్ఠ ద్యోతకమవుతుంది. తత్త్వ గ్రాహకత్వం, ఆధునికత్వం రెండింటి సమన్వయమే శ్రీ సుబ్బారావుగారి వ్యక్తిత్వం.

శ్రీ విశ్వనాథ ప్రశస్తం చేసిన మధ్యాక్కర వృత్తాన్నే శ్రీ సుబ్బారావుగారు తమ రామాయణ కృత్యాద్యవస్థకు వాడుకొన్నారు. మనసులోని భావాలను పలు విధాలుగా వ్యక్తీకరించేటప్పుడు పునరుక్తులు దొర్లడం కద్దు. అయినా అవి పాటకు పల్లవివలె ఈ కావ్యంలో రాణించాయి.

శ్రీ సుబ్బారావుగారు ప్రారంభించిన శ్రీ రామాయణంలోని కొన్ని భాగాలను నేను చదువుకొని ఆనందించాను. అంతకంటే రసవంతంగా రచించాలని నిరంతర సాధనలో వారున్నారు. వారి ఆశయం సత్వరం ఫలించుగాక! మధురమధురంగా మరొక రామాయణం వెలసి మాకందరసానందాలను మనకందే శుభ సమయం కోసం నిరీక్షిస్తుంటాను. శ్రీ సీతారాములు శ్రీ సుబ్బారావుగారిని అనుగ్రహింప వేడుకొంటూ ఉంటాను.

'ఉత్పల'

# కృతజ్ఞతలు

నా పద్య కవిత్వానికి స్ఫూర్తిని, ఆచార్యత్వాన్ని అందించిన సహృదయులు, సద్విమర్శకులు, పండితులు, ప్రియ మిత్రులైన డాక్టర్ సాళ్వ కృష్ణమూర్తిగారికి, నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

సహృదయంతో, ఎంతో ఓపికతో నా వ్రాతప్రతిని పరిశీలించి, తమ అమూల్యమైన సూచనలతో, నా కావ్యానికి ఒక నిర్దుష్ట రూపకల్పనలో తోడ్పడిన గురువర్యులు, లబ్ధ ప్రతిష్ఠులు, విద్వత్కవులు, సాహితీవేత్తలైన, బ్రహ్మశ్రీ ఉత్పల సత్యనారాయణాచార్యుల వారికి – నా ప్రత్యేక కృతజ్ఞతాభివందనములు.

భావుకుడు, సాహిత్యాభిలాషి, సహృదయుడు, ఆప్తమిత్రుడైన శ్రీ వ్యాకరణం అశ్వత్థ నారాయణగారికి –

ప్రసిద్ధ కథారచయిత, సౌజన్యం, సహృదయం పెనవేసిన సాహితీమిత్రులు శ్రీ గిడుగు రాజేశ్వరరావుగారికి –

సాహితీ మిత్రులు, సహృదయులైన శ్రీ చీకోలు సుందరయ్యగారికి –

పద్య కవిత్వాన్ని పట్టి, వదలవద్దన్న, ఆబాల్య మిత్రుడు, కవి, శ్రీ ఆమరి జోసఫ్ గారికి –

నా హార్దిక కృతజ్ఞతలు.

ఇక –

అన్న కవితా వ్యాసంగాన్ని మనసారా అభిలషించి, చదివి, ఆనందించే ప్రియ సోదరుడు, డాక్టర్ జి. రామమోహన్‌కు –

నా కవిత్వాన్ని విని ఆనందించే మా కుటుంబ సభ్యులందరికి, సహృదయులైన బంధుమిత్రులందరికి –

నా వెన్ను తట్టి, బిద్ధకం వదిలించి, ఈ పద్య కవితను అచ్చయ్యేలా నన్ను ప్రోత్సహించిన శ్రీమతికి –

నా ఆశీస్సులు, కృతజ్ఞతలు.

ఈ కావ్యం, చక్కగా ముద్రించిన ప్లానోగ్రాఫర్స్ వారికి నా ప్రత్యేక కృతజ్ఞతలు.

– రచయిత

# వేదనా మధ్యాక్కరలు

శ్రీ ధవా! సీతాపతే! వశీకరణైక మహత్త్వ
గాథాసుధాబ్ధీ! ధనుఃప్రగాఢ హేలా వికాసక్రి
యా! ధరిత్రీ సుతా మానసాహ్లాద రూపా! నమోస్తు!
వేదనా మధ్యాక్కరల – నివేదింతు, కవితా తపమ్ము! 1

బూది నందించి, విభూతి, – పూర్ణ కృపనొసంగి చెలగి,
సాధనాబలము, భక్తజన సాంగత్యమహిమ నెసంగి,
భేదమే లేని యద్వైత పీయూష మిడు, హరిహరుల –
వేదనా మధ్యాక్కరల – నివేదింతు – కవితా తపమ్ము! 2

నీ దయిత యెద పొంగులిడు, నిత్యవిరహ వేదనాగ్ని –
నాదయిన బ్రతుకులో గనలు వేదనాగ్నులన్ గ్రమ్మి,
సాధనా పరమార్థమనగ, స్వామి కథామృత మంద –
వేదనా మధ్యాక్కరల – నివేదింతు, కవితా తపమ్ము! 3

రోదన తోడనే, బాల్య రోగావసానమ్ము కలిగి,
సాధనతోడనే, ప్రతిభ, సాహిత్య సాంగత్యమెసగి,
మైథిలీ ప్రేరణోద్ధృతులు, మానసాబ్ధి, తరంగ గతిగ –
వేదనా మధ్యాక్కరల – నివేదింతు, కవితా తపమ్ము! 4

ప్రోదియై యజ్ఞాన తిమిరపుం మొయిలు, ఎదలగ్రమ్మి –
సాధనా భాస్కరోదయము, సంస్కార కిరణ రోచిస్సు
లాదికవి కథాసరిత్తు లందింపగానీక – వగచి –
వేదనా మధ్యాక్కరల – నివేదింతు, కవితా తపమ్ము! 5

మాధురీ రీతిలో కవిత, మై మఱుపులొలుక - రసము,
గాథా మనోజ్ఞ కథన వికాసమ్ము, ప్రాతిభాధ్వమ్ము -
బాధాంతరస్థ విషాద భావాబ్ధిగా నెదచింద -
వేదనా మధ్యాక్కరల - నివేదింతు, కవితా తపమ్ము! ।

ఆది కవులు, నన్నయార్య్య అందించె మధ్యాక్కరలను!
ప్రోది చేసెను విశ్వనాథ, - పురుషోత్తముని రమ్యగాథ!
నాదైన ప్రతిభతో, మధుర నాదస్రవంతి, - రసార్ద్ర
వేదనా మధ్యాక్కరల - నివేదింతు, కవితా తపమ్ము! 7

పాదుకొన్నది యెదలందు పచ్చగా భక్తి పాదపము!
సీద, సాద మనమ్ము అందు చిగురించె పల్లవములుగ!
నీ దయా క్షీరాబ్ధి బొరలి, నిండె కవిత్వంపు టలలు -
వేదనా మధ్యాక్కరల - నివేదింతు, రసరమ్య ధునుల ! 8

పేద నౌదును నేను, నిగమ విద్యాప్రకర్ష లోపించి!
ఖేద మందెద నేను, ప్రతిభ కేల్వట్టి, కవితా తపమ్ము
నీ దయా పీయూష మంది, నెలతగాథ, - రసాబ్ధిగాక -
వేదనా మధ్యాక్కరల - నివేదింతు, శోకార్ద్ర గీతి! 9

సాధు జీవన పథి, ప్రతిభ, సాహిత్య పరిచయావధిగ,
వేదనాధీనమై హృదయ వీథుల మెదల - విషాద
గాథగా - కవితా తపమ్ము, కాకుత్థ్స కథను సృష్టింప -
వేదనా మధ్యాక్కరల - నివేదింతు, మైథిలీ వ్యథను! 10

కాదన్న నౌనన్న, రామ! కథను నే నాప! నీభార్య
గాదన్న నౌనన్న - మాతృకారుణ్య మెఱిగి, రచింతు,
నాదన్న దీ గాథ - తపమునై, కవితాత్మగా వెలిగి -
వేదనా మధ్యాక్కరల - నివేదింతు - మైథిలీవ్యథను! 11

నాథు శక్తి నెఱింగియును, యనాథగా మెలగె నా సీత!
సాధువర్తను డయ్యె ప్రభువు సంగ్రామ భీకరుండయ్యె!
ఏదియు నెఱుగంగ లేని, హ్రీముగ్ధుడేను! - రసార్ద్ర
వేదనా మధ్యాక్కరల - నివేదింతు - మైథిలీవ్యధను! 12

మేధాప్త, ప్రతిభాత్త కవిత, మీదుకట్టితి రామ! నీదు
గాథా ప్రపంచమ్ము, - హృదయగాఢానురాగాత్మ, సీత, -
బాధా కథా సరిత్తు - రసబంధుర కావ్య న్ఝిర రిగ -
వేదనా - మధ్యాక్కరల - నివేదింతు - భక్త్యాత్మనొచు! 13

పేద్దనై - మధ్యాక్కరలను పీయూష మొలికించి, రసిక
మేధాప్త దీప్తిగా నిల్పి, మేలైన ప్రతిభాత్తపథము
నీదిగా, రఘురాము గాథ - నిర్మింతువా? రసరమ్య
వేదనా మధ్యాక్కరల! భవిష్యత్తు నవ్యమై వెలుగ? 14

సోదె గాదీ కవిత్వమ్ము! శోభిల్లు మధ్యాక్కరలను!
శ్రీధరిత్రీ సుత శోక చిత్త ప్రవాహాత్త రమ్య
గాథాబ్ధి, నా గీతి! రసము, - కథనమ్ములో, - ప్రతిభాత్త
పాథోధి శీకరమ్మగుచు, పద్యశిల్పము, ప్రదర్శింతు! 15

ఆదికవి, రసార్ద్ర కావ్య మాత్మలో నిల్పి - వైదేహి
బాధామనోగాథ - నాదు ప్రతిభా మనోజ్ఞ కవిత్వ
సాధనా కలిత గాథలుగ, సాహితీ జగతిలో నిల్ప -
వేదనా మధ్యాక్కరల - నివేదింతు - రామాయణమ్ము! 16

గాధిజు, గురు కృపామహిమ, కార్ముక పాండితీ గరిమ, -
గాథగా, దనుజ సంహార కార్యమ్ము దీర్చి - కల్యాణ
వైదేహి, ప్రణయాత్త మధుర వైభవ క్షీరాబ్ధి దేలు-
వేదనా మధ్యాక్కరల - నివేదింతు - రామాయణమ్ము! 17

క్రోధమ్ము గుండెలో నిండి, రోషమ్ము క్షాత్రమ్ము - బ్రాహ్మ్య
గాథా పవిత్రత నడ్డ - కార్త వీర్యార్జును దున్మి -
బాధోప శమనమ్ము నంది, బాల రాఘవు చేత లొంగ -
వేదనా మధ్యాక్కరల - నివేదింతు - తద్వీరు కథను! 18

పాదు కొన్నట్టి భక్త్యాత్మ, పారవశ్యము నందు భరతు,
గాథలే, భ్రాతృ ధర్మాత్త కార్యమ్ము లగుచు, రాఘవుని,
పాదుకా పట్టాభిషిక్త ప్రాభవోన్నత భావమగుచు -
వేదనా మధ్యాక్కరల - నివేదింతు - రామాయణమ్ము! 19

ఆదిశేషుని వోని, యనుజు, డాయన్నకున్ నీడగాగ, -
భూదేవిసుత, స్వామి, ధర్మపూర్ణావతార సాధనకు,
ప్రోదిగానిల్వ, - కోదండ రోచిస్సు, తారకమ్మగుచు -
వేదనా మధ్యాక్కరల - నివేదింతు - రామాయణమ్ము! 20

శ్రీధారుణీ పుత్రి శోక చేతమ్ము లోని దావాగ్ని -
క్రోధారుణాక్షుండు, రామ కోదండ రూక్షభావాగ్ని -
గాథాకళా శిల్పి, యాదికవి, రసరమ్య వాక్సుధల -
వేదనా మధ్యాక్కరల - నివేదింతు - రామాయణమ్ము! 21

బోధలై మాతంగ మౌని పుణ్య సేవలును, గుర్వాజ్ఞ -
శ్రీధరుని, నిరీక్షణలను, - చేతమ్ము యౌవనమ్మగుచు,
సాధించె యోగమ్ము శబరి, - స్వామి నర్చించె, నిర్మమత! -
వేదనా మధ్యాక్కరల - నివేదింతు - రామాయణమ్ము! 22

రామాయణము నీది, మనసు ఊపిళ్ళు నారపిళ్ళుసేయ,
శ్రీమాత లోలోన, శోక చిత్తమ్ముతో పొంగులెత్త -
నా మాట, నా యూహ లొదిగి, నాతిగాథగ, సాగబోక -
రామ! మధ్యాక్కరలనుచు, - రామాయణము నాది - సాగు! 23

కవితయే శ్వాస! రామన్న గాథయే ధ్యేయమ్ముగాని, –
అవరోధములు హెచ్చి, ప్రతిభ అందగలేని వ్యుత్పత్తి,
కవితా, రథాశ్రయ, పద్య గమనమ్ము లడ్డి – నిస్పృహల
వివరింతు, – మధ్యాక్కరల! నివేదింతు వేదనా ధునుల! 24

నా దారి, నాదిగా, కవిత, – నాదానుగుణ్యమ్ముగా, వి
షాద భావప్రవాహమ్ము, షడ్జమస్థాయిలో పెంచి,
నీ దయిత యెడంద నేలు, నిర్ఝర శోకస్రవంతి –
గాథా మనోజ్ఞ కావ్యమ్ముగా, నిల్పుటే – నా తపమ్ము! 25

మథియించి, మథియించి, నాదు మానసాంభోధి, – వేదనలు –
గుదిగొన్న కవ్వంపు బలిమి, కోదండ రామన్న కథను –
వ్యధల పుట్టిల్లు, – సీతమ్మ – వాగ్ధార – రసరమ్య భావ
సుథలుగా, ప్రతిభా ప్రసూన శోభాస్రవంతి, – సృష్టింతు! 26

మధురమై, యార్ద్రతా మహితమై, రసరమ్య భావనలు, –
మిథిలాసుతా హృదయార్ద్ర మిళిత శోక రసవాహినుల, –
నధునాత నమ్మైన ప్రతిభలచ్ఛొత్త, – నీకథా కథన
పథములో నిర్మింతు, రామభద్ర! కావ్యమ్ము తపముగ! 27

భక్తి బీజము నాటి హృదయ వనభూమి లోన, ప్రేమాను
రక్తి పోషించి, కావ్యలత, – రామా మనో శోక గాథ
నుక్తి వైచిత్రితో, ప్రతిభ లొప్పిన కావ్యతపమ్ము –
ముక్తికై చేతునో, ముగ్ధమోహన రామ! నీకథగ. 28

అచ్చంపు తెలుగింటివారి యాడు పడుచు వీవటంచు,
స్వచ్ఛంపు ప్రణయమ్ము లొలుకు, స్వాధీన పతిక వీవంచు, –
ముచ్చటగ, రసార్ద్ర సుధల, ముగ్ధ మోహన భావ పుష్ప
గుచ్ఛమ్ముగా, ప్రతిభా నిగూఢార్థ కావ్య మర్పింతు! 29

మధ్యాక్కరల లోన, నాదు మనసులో వేదనా ఝురుల, -
బాధ్యతాయుత జీవయాత్ర, పండించునట్టి తపస్సు, -
స్వాధ్యాయ నిరతమ్ము నైన, వ్యక్తిత్వమున్, ప్రతిభలను -
పథ్యమ్ముగా - రసరమ్య భావ జలధుల నిండింతు! 30

మనసులో భావనా ఝురులు, మధుర కావ్యావేశ గతులు!
తనువులో జీవధాతువులు, తల్లి వేదనల వాహినులు!
మనసు, తనువులు గలియు - సమన్వయ ప్రతిభలే - విరియ -
వినిపింతు రసమయ కవిత! విద్వత్తు లోపింప నేమి? 31

విద్వత్తులే లేవు! ప్రతిభ విచ్చిన - కవితా తపమ్ము -
సద్వర్తనమ్ము, భక్తియును, చాలు నంచని పూనినాడ!
విద్వదధిక భావుకతల - వెలది శోకమ్ము, నీకథగ
నుద్వహించితి! రామ! రసము లొల్కించి, వెల్గింపు కవిత! 32

ఆకృతియును లేదు! రసమయమ్మగు భావనా జలధి
కాకృతియునుగాదు! కవిత కాలంబనమ్మైన ప్రతిభ -
స్వీకృతిన్ గొని, ధ్వని రమ్య శిల్పమ్ము గాదు, నా రచన!
ఈ కృతిన్, నా మధురోహ, లింపు గొల్పెడి మెఱుపులీను! 33

ఊరకే నేను - రసాత్మ, నూహా విహంగమ్మునౌచు,
శ్రీరామ! నీ సీత వగపు చిత్రింతు శోకార్ద్ర కథగ!
ఆరాలు దీయకే? యెదల, నారాట మీ రీతి, భక్తి
గా, రంజిలి, ప్రతిభ లొల్కు కావ్య మౌనట్లు రక్షింపు! 34

వగపులో నౌచిత్య మనుచు, వల్లమాలిన, మమతలను,
నగుబాటులే నిల్చుననుచు, నవకావ్య నిర్మాణ పథిని,
రఘురామ! రసరమ్య కవిత రాజిల్లు ననుచు, తపమ్ము
లగునట్లు ధ్యానించు నన్ను - హాస్యాస్పదుని చేయబోకు! 35

విద్వత్తు లేదనుచు, రసవీథి గాదనుచు, వేదార్థ
సద్వచస్సులు గావటంచు, సారస్వతాంభోధి లోన
విద్వదగ్రణి మెచ్చు, ప్రతిభ విచ్చిన కవిత, గాదనుచు, -
హృద్వ్యథి నిరసింపకురా! సహృదయ నైవేద్యమే యిద్ది! 36

భావనా ఝురులెల్ల, బ్రతుకు బాధల, గిరుల, స్రవించి,
శ్రీ వేదనా స్రవంతుల, విశిష్ట శోక రసమ్మ అగుచు, -
నా వాక్కులై, ప్రతిభాత్త నాదప్రపంచమై, కవిత
లే, వేదనా గీతుల, ప్రవహించె, నీ గాథగా, రామ! 37

వయసేమొ పరువెత్తు, మనసు నైనమ్మ నెఱుగ కుండగను!
భయమేమొ యెదలోన, బుసల పాముల పూత్కార మెసగు!
దయితా హృదబ్ధిలో ఘోష, దశరథాత్మజు కథగాక -
మెయి వణకు, మనసులోన, మెఱుపైన కవితకే, దిగులు! 38

వ్యాకరణమ్మ, ఛందమ్మ, వల్లె వేయను లేదు! ప్రతిభ
తో, కవితా తపమ్మలను, తోయజాక్షి, మనమ్మలోని
శోక నిర్ఝరులను, - రసము శోభిల్ల, ధ్వను లుప్పతిలగ,
నీకథగ - రచింతు నంచు నే, విఱ్ఱవీగెద! రామ! 39

వాల్మీకి, నా కన్న గొప్ప వాడేమి యనుచు, సమ్రాట్టు -
పల్మాఱు, తన గొప్ప చెప్పి, పాండిత్య మొల్కించె ననుచు, -
వల్మీకమున నున్న భుజగ వక్రప్రతిభ చూపి - కవిత, -
కల్మి కన్నియ శోక గాథ - కాకుత్స్థు మెప్పింప చూతు? 40

తిక్కయజ్వను గాను! తేట తెన్గున రసదీప్తు లొలుక!
మిక్కిలి భక్తిరసాత్మ - మేటి యా పోతన్న గాను!
ఉక్కు పిండము, - గురువర్యు నుజ్జ్వల ప్రతిభ నే నంద!
తక్కువై నన్నింట రామ! తలపెట్టితీ కావ్యతపము! 41

వెనుకంజ వేయగా మనము, విహ్వాలంబగు నోయి! రామ!
కనుకట్టు గాదుగా కవిత? కథన శిల్పమ్ములన్, ప్రతిభ -
ధునులుగా, రసరమ్య భావ తోయధిగ, భవత్కథలను,
వినిపింపగా, తల్లి నోట - వేదనలె మిగిలె! స్వామి! 42

ఎన్నాళ్ళు ఛందమ్మ, మఱియు నెన్నాళ్ళు కావ్య ధర్మమ్మ -
కన్నార, చెన్నార దెలిసి, కాకుత్థ! నీ నాతి కథను,
కన్నీళ్ళ కడలిగా, కవితగా, ప్రతిభా మహోదధిగ -
నిన్ను సంతుష్టి జేయంగ - నేనెట్లు తపము గావింతు? 43

తనువు కొండొక వేళ, రోగధర్మమ్మ తోడ కృశించి,
మనసు లొండొక వేళ, దుఃఖ మహితాబ్ధి లోన మునింగి,
తనువు, మనసు లొకవేళ, తాదాత్మ్యమైన, - దుర్విధులు
కననీవు, మననీవు, నాదు కవితాతపమ్మ! శ్రీరామ! 44

చివరి కంచును వచ్చె, నాదు జీవ యాత్రలు, స్వామి! యింక
కవితా తపమ్మ, లేరీతి, కాంతా హృదంతర వ్యధల -
భవ బంధ ముక్తిగా పరగు, ప్రతిభాత్త కావ్య నిర్ఝరుల,
ప్రవహించు టెట్టులో? రఘువరా! నీదు కథలౌట యెట్లు? 45

ఔచితీ రమ్యమై, ధ్వనుల నలరెడి కవితా తపమ్మ -
రాచ పుట్టువు, రాముని రసరమ్య గాథ, ప్రతిభతోడ,
నీ చెలి శోకగాథలను నిర్మింప - మధ్యాక్కరలను -
నా చేత నౌనె? విద్వత్తు - నాకు లభించునే? రామ! 46

నావయై, సంసార జలధి, - నా దీన జీవితాశయము,
త్రోవలో ఝంఝామరుత్తు త్రోపిడిని, గలంగి, తీర
మేవంక నో గాన లేక - యిడుమలను బడుచు క్రుంగు!
శ్రీవల్లభా! ప్రతిభాత్త శిల్పమ్మ కవితలో నిల్పు! 47

అచ్చంపు తెల్వి లేదసలు, - ఆపైన విద్వత్తులేదు!
స్వచ్ఛంపు భావనలు రసవాహిను లయి, ప్రతిభలను,
స్వేచ్ఛా కవిత్వ విహార వీథులునయి, కావ్యరచన -
మెచ్చగా, నే చేతునా? రమింతురా? రసికాగ్రగణులు! 48

నొచ్చు నీ తనువు రోగార్తి! నొచ్చు నీ మనము శోకార్తి!
ఎచ్చటైనను ప్రాక్తన విధి, యేలు నీ జీవితాధ్వముల!
పచ్చగా నున్న కవిత్వ వాహినీ పథము - నా స్వామి
మెచ్చునట్లుగ, రసధ్వనుల మేళవించునా? సీత కథగ! 49

మమతానురాగాల, హృదయ మాధురుల, రసార్ద్ర కవిత
లమరి, తపమ్ముగా చేయ యత్నింతు, మధ్యాక్కరలను!
రమియింతురో? సహృదయులు - రసరమ్య నిర్ఝరు లంచు!
భ్రమియింతురో? విమర్శకులు - ప్రత్యగ్ర భావ వాహినిగ! 50

ఇది పుట్టకుఋపొచు, ఎదల నేచు సతమ్ము, శ్రీరామ!
విధి దూరగా, నేమి ఫలము? విద్వత్తులో - పట్టుగొమ్మ
లొదవగా లేని, యీ ప్రతిభ లొకయింత చిగురు వేసినవి!
కథలు - రసార్ద్రమౌ కవితగా - ఫలించునె? నీదు కరుణ! 51

వేదనలు సహజమ్ముగను విరియు నీయెడదలో - శోక
గాథలుగ, రసరమ్య మగు కవితా తపః ప్రవృత్తులుగ!
మైథిలీ హృదయ శోకార్తి, మేళవించిన, నాదునార్తి -
నాథు కరుణ, ప్రతిభాత్త నందన ప్రసవమ్ములౌనా? 52

విసుగది విడుపు లేకుండ, వేదనలు పారలి, ప్రతిభ -
రసరమ్య కావ్య తపముగ రాణించి, నీ కథ గాక -
కసిపట్టె దుర్విధి తుదకు! కాలయాపన లేల? మృత్యు
వసువుల మ్రింగక మున్నె యాలించి, నా గోడు తీర్చు! 53

అన్నిటను విరక్తి గలిగి, ఆశా లతలు పల్లవింప
కెన్నడును, కవితా రథము శ్రీ ముగ్ధ పథములో నిలిచి,
నిన్ను కీర్తించు కావ్య రమణీయ కేతన మెగురంగ,
చెన్నుగా ప్రతిభామృత రససిద్ధి, సాధింపగాబోదు! 54

నచ్చెనా నీకు నా కవిత? నళినాక్షి వేదనా జలధి
ద్రచ్చి, నీదు కథామృతమ్ము, రసరమ్య ప్రాతిభాధ్వమున,
హెచ్చునౌ, ధ్వనికావ్య రూప హేలా మనోజ్ఞముగ, వగ
పచ్చ గ్రుద్దిన యట్లు, నాతపమ్ము పండిన యట్లు – వెలుగ? 55

మాతామహుల కృప, – భక్తి మకరంద రసధుని జిమ్మ
పోతన్న – పరిచయమ్మైన, పూర్వాంధ్ర గీర్వాణ కవుల
కైతలు, ప్రౌఢ వయసున, కావ్యాత్మ నిల్పబూనితిని, –
సీతా సతీ మనో వ్యధలు, శిల్పాభిరామమ్ము చేయ! 56

కథ లటన్నను రామకథలు – కావ్యమ్మనంగ మైథిలివి
వ్యధలు, రసార్ద్ర రమ్యములు, వ్యంగ్య వైభవమనోజ్ఞములు, –
ప్రథిత పూర్వాంధ్ర సత్కవి పరంపరాగతము లౌనట్లు
మథియింప – ప్రతిభా సుధాబ్ధి – మా కందు భక్తి కావ్యమ్ము! 57

పితలకోర్కెలు చెలగంగ, పితృఋణమును దీర్ప – కవిత,
పతి గుండెలో వగల, రస సాగరమ్ములు చేయ – ప్రతిభ
నతిలోక రామాయణమ్ము నందింప బూన – వ్యుత్పత్తి
చతికిలం బడె, స్వామి! యెటుల సాధింతు కవితా తపమ్ము? 58

వాసంత మధుర సమ్మిళిత వార్తలందించు పికమ్ము!
ప్రాసాదినియమ బద్ధమ్ము ప్రస్తుతమ్మని కేకి పలుకు!
హాసాంతరమ్ముతో, పుష్ప హాస పీయూషమ్ము – తేటి
నాసాగ్రమున జల్లు! మఱియు నా కందదా? కవిత్వమ్ము? 59

గ్రీష్మాన, భాస్కరోగ్ర కర కీర్తి నిండించు నీ పుడమి!
ఊష్మాన పుర జన హృదయ ముక్కిరి బిక్కిరై వగచు!
భీష్మాన, పవనుండు తనువు బిఱ్ఱ బిగించి, స్తంభించు!
గ్రీష్మమ్ము భీష్మించి యెడద గీలించి, కవిత లెండించు! 60

ప్రావృడంబుద నీలకాంతి, ప్రస్ఫుటమ్మయి శంపలెసగ,
ఆవృతావృతమయి, వర్షమంత, గిరుల - నిర్ఝరులయి,
గోవృద్ధ, శిశు జన, విరహ గూఢార్తి, ధారలై పారల, -
ఆవృతమ్మయ్యె వర్షర్తు వందు - నాకష్ట కష్టాలు! 61

శరదాగమన వేళ, నదులు చల్లనై మెల్లనై కదల,
సరసుల కలహంసి, మంద చలనమ్ములన్ క్రీడసేయ,
మరులేచు కరిణీ మనమ్ము మత్తేభ సాంగత్య మరయ -
విరియదీ యెద, - కవితా నివిష్ట తమమ్ము సతమ్ము! 62

హేమంత మానంద భావ హేలా మనోజ్ఞమ్మునగుచు,
చేమంతి, విరబూచి నవ్వి, సీమంతినీ కేశ మొదిగి,
భామాంతర ప్రణయ మధువాను ప్రియుని హర్ష మొలికి, -
హేమంత శీతల జ్యోత్స్న - యిముడదీ కవితా పథాన! 63

శిశిరమ్ము దంపతీ మధుర శీధువై, సాధువై యొప్పి,
కృశితాంగి, నయనాంత దీప్తి, ఊెలలో శృంగార మొలికి,
వశితమై శిశిరర్తు రమ్య వాహ్యాళి, వాసనాపథిని,
భృశమొౌచునిల్వ - నాలోన ఊెగె నూహల శిశిరమ్ము! 64

సర్వర్తు భావనా రమ్య సాన్నిధ్య శోభ, లీ యెదల,
సర్వాంగ సుందరమ్మైన సాహిత్య వాహినీ గతుల,
బర్వమ్ముగా, చేయు, నాదు భావ బంధుర కావ్యతపము -
గీర్వాణి కృపనంచు పొంగ - గేలియే మిగిలె నా కవిత! 65

క్షీర పాథోధి ద్రచ్చంగ - చిచ్చులై విషధూమ మగుచు
నూరె హాలాహల వహ్ని! ఉరగభూషణు చేతివెన్న!
గౌరీ ప్రసన్న ముఖమ్ముగాంచి, మ్రింగె గుటుక్కున, - విష
భారమెల్ల, గళ మిమిడ్చి - భాసిల్లె నీలకంఠుండు! 66

నా మనః క్షీరాబ్ధి, దిన దినమ్మును భావనా గిరుల
గామించి, రసరమ్య భరిత కావ్య పీయూషమ్మునంద
గా - ముచ్చటలు వోవు! మథన గల్గిన - హాలాహలమ్ము
లీ మదినిండె! రక్షింప వేమిరా? శ్రీనీలకంఠ! 67

గోవర్ధనమ్ము తృణముగ గోరంటనెత్తి, గోపులను,
ఆవుల, లేగదూడలను, ఆశ్చర్య కరముగా, ఛత్ర
మావరణమ్ముగా నిల్పి - మహిని - గిరిధరుండు నైన,
శ్రీవత్స లాంఛనుని, మది సేవింతు, మధ్యాక్కరలను! 68

మాయ తానేయౌచు, పసుల మందల, గోపబృందముల,
మాయ జేసి - బ్రహ్మ మదము, - మటుమాయమొప్ప - సృష్టించి
తోయన్న! శ్రీకృష్ణ! మఱల తొల్లింటియట్ల - గోపులను
మాయురే! యావులను, మఱి మంద లన్నిటి, గోకులాన! 69

శ్రీకృష్ణ తత్త్వమ్ము తెలియ, చేతమ్ము 'తహతహం'పడును!
ఆ కృష్టి - నీనల్ల నైన యాకార మందునా? లేక -
శ్రీ కృష్ణ! నీ తీపి మోవి జిందు, వంశీ నినాదమ్మొ?
ఏ కృషియు నెఱుంగ! నీవ, - యేలింపుమీ కవితాత్మ! 70

గోపికాంగనల, రసార్ద్ర కోమల హృదయాంబు జాత
మాప దోద్ధారకు డనుచు, నత్యంత భక్తితో - భృంగ
రూపుని, నిను గొల్వ - వారి రోదనల దృణీకరించి,
చూపు కందక, నవనీత చోర! యేడ్పింతువా సతుల? 71

నా మనో గోపికాంగనకు - నాథ! నీ వేణు గానమ్మె
రామార్ద్ర రసహృదయ మధుర ఝరీ ప్రవాహమ్మునగుచు, -
నీ మేని క్రొంజిగి, నిత్య నిర్మల భావమై యొప్పి-
స్వామి! నాకవితా తపమ్ము సాహిత్య జగతినే యేలు! 72

నీ - నీలి క్రొంబెదవి, రమణీయ మధువు, లెంద ఱెంద
రో, నాతు లందంగ బృంద - రోదించె హృదయ సామ్రాజ్య
మానందమున ఏలు కవిత! ఆ - రాము నధరమ్ముగ్రోలి -
నా నాతి, సీతయే తగియె; నా స్వామి యామె హక్కయ్యె! 73

బ్రతుకొక్క జూదమై చెలగి, పావులీ యసువులై యెసగి,
మతులెల్ల గుఱ్ఱమ్ములై, సుమంత్రులై బుద్ధియు, భూమి
పతులు, ఎత్తులు నయి, ఆట భారమ్ముగా సాగు రామ!
గతియేమొ? కవితా తపమ్ము గమ్యమ్ము - లేమేమియగునా? 74

గుఱ్ఱములు, భటులు, రణము కోరి, మున్ముందుగా దూకు!
ఎఱ్ఱనౌ కనుల, రాజేమొ, యెదురొడ్డి నిలుచు! మంత్రియును
బొఱ్ఱ మీసాలు దువ్వి, యలవోకగా వ్యూహమ్ము పన్ను!
గుఱ్ఱప్పడిని నేను! ద్యూతకోవిదుండను గాక వగతు! 75

మఱ్ఱి యాకుల,లీలదేలి, మధురోహలందు మునింగి,
కఱ్ఱి శిశువ! ప్రళయాంత, కాల మహాంభోధి లోన -
వెఱ్ఱిగా విహరించు సర్వవేదార్థ రమ్య స్వరూప!
గుఱ్ఱప్పడిని నేను! కవిత కున్ ముడి వెట్టితిన్ బ్రతుకు! 76

ఎఱ్ఱనై, బుఱ్ఱనై, సొగసు నేలంగ యౌవన మ్మందు,
వెఱ్ఱిగా శృంగార వీథి విహరించి, తన్మయుండైతి!
కఱ్ఱి దున్నను వోలె ఱేగి, కాలమ్ము గ్రుమ్మ - వార్ధక్య
మఱ్ఱాకులై గ్రుంగి,.- కవిత మాటున - భీతి వెలార్తు! 77

చిట్టిన్న, బుట్టిన్న, – తనువు చింతించు నారోగ్యగతిని!
గుట్టుమ్మనై మనమ్ము – వగ గుంది, వల్గనము లొనర్చు!
'కట్టిలోనే తెల్పుగలదుగా!' – యంచు, కవి నౌచు, 'వద్దు!
మొట్టో!' – యనగ బుద్ధి – తపము మొదలిడినాడ! శ్రీ రామ! 78

చుట్టుమనె గతమ్ము, బుద్ధి, శూన్యమ్ముగా ప్రవర్తింప!
జట్టున జాఱె మనమ్ము – సంసార చపల భావాబ్ధి!
అట్టులు సాచె, వృద్ధాప్య మానంద డోలాప్త కేళి!
వెట్టిగానీక, – నా బ్రతుకు, వెల్గు చూపించరా! కవిత. 79

ముట్టుపాలంచు కామమ్ము, ముగ్ధ మోహన మంచు మమత.
జూట్టుచు విషయాప్త దధుల, జొచ్చితి, సంసారజలధి!
పట్టులై జీవనాధ్వమ్ము భక్తి బీజమ్ము మొల్కెత్త –
కట్టి గోపన్న! నా కవన కాళింది పొంగు లెత్తింపు! 80

తాహత్తు లందుకోక, కవితా తపమ్మొనరింప – ప్రతిభ
లూహల పందిళ్ళు వేసి, యోగేశు గాథ, – రసార్ద్ర
వాహినీ మధుర తరంగ వర్ధిత కావ్యమ్ముకాగ
'నోహెూ!' – యటందురా? రసికు లూర కొందురా? చప్పరించి! 81

"పునరుక్తి దోషమ్ము లిందు, పూర్ణమ్ముగా నుండె ననుచు,
అనురక్తియే తప్పు, పండితాదర మొందు వ్యుత్పత్తి, –
కనిపింపదీ ప్రతిభాత్త కథన మందనుచు – రసార్ద్ర
ధునులై, మధ్యాక్కర అగుచు, దూకెనే? –" యని దూఱ వగవ! 82

చిన్నారి, పొన్నారి, చిఱుత చేతుల, నిన్ను కొల్వకయు,
కన్నున్న ఫలమేమి, నిన్ను గానక యున్న? గాత్రమ్ము
లున్నంత కీర్తింప లేని, యుబలాట మదియేల? కవిత
నన్నింత కవ్వించి, తపము నాదౌనా? ధూర్జటీ? రామ! 83

అమ్మగారికి చెప్పి, స్వామి కా, పతికి, 'సిఫారసు'లను
ఇమ్ముగా చేసి, నా కవిత లెందు, సంగీత స్రవంతు
లమ్మానినీ మనోగత దయార్ద్ర కథాబ్ధు లగుచు - ర
సమ్ములుప్పొంగ - నీ భక్తి సాహిత్య సంపత్తి నీవె! 84

కొంతైన, సుంతైన, గుండె గూడులో దివ్వెగా నీవు -
కాంతా మనోహరా! వెల్గి, - కారడవి, తమము తఱుమ
కెంతైన తడవు సేసెదవు! ఇంపైన తెనుగులో, ధ్వనులు,
గొంతులో, కవితలై, తపము గొప్పగా నిల్పు! శ్రీరామ! 85

పడిలేచి, పడిలేచి, పాప పంకిల సరసి నిత్యమ్ము
జడుడనై పోతి! వాసనలు జన్మాంతరమ్ము నన్పట్ట,
ముడి వీడదీ గొంతు! భువన మోహన! నిన్ను కీర్తింప!
సడిలేని, విడలేని, వ్యర్థ సంసార మిద్ది! శ్రీ రామ! 86

వయసు వ్రాలిన కొద్ది, మనసు వ్రాలుచు నుండె, మోహాల
బయలులో! నీ చింతనమ్ము - బ్రతుకులో నొకయింత, ప్రాణ
భయమునున్ దిగబాపి, కవిత పండగ నిమ్ము! భక్తిరస
మయగీతిగా, ధ్వని రమ్యమౌ మధుర కథగా, - రామ! 87

పట్టి బంధించు నీ, లోక భావనలు సతమ్ము మనసు!
నట్టేట ముంచు వాసనలు! నా జన్మ కీ మలిసంజ
లెట్టులైనను చీకటులును! హ్రీముగ్ధ రూపా! యెడంద
కట్టివైచుము! నాతపమ్ము కవితగా జేసి రక్షింపు! 88

ఒకరోజు కొక రోజు బురద నొదిగి కూర్చుండె నాతనువు,
ఒకనాటి కొకనాటి కన్న నుద్ధుర వృద్ధత్వ భరము
ప్రకటీ కృతమ్మునై, మనసు ప్రారబ్ధ కర్మలన్ దవిలి,
వికటించె నా బ్రతుకు! రఘువీర! నిరాధారినైతి! 89

ఇంత కైనను నాదు గళము – ఈ గాథ, ధ్వని రమ్యమైన
ధ్వాంతమ్ముగా చేయ, కవిత వాహినులౌచు, తపమ్ము
లెంతైన పండు, నీదైన హేలగా, కృపలుగా విరిసి, –
కొంతైన, నా బ్రతుకన్న, కొమ్మ – పుష్పించునా? రామ! 90

వృత్తిలో,నే, ప్రొద్దు, యసమ వృత్తమ్ముగా బ్రతుకైన, –
నత్త నడకల నీవిన్ని నాళ్ళు, నిర్ధన జీవివౌచు,
రిత్తయై, ప్రాతిభాంతర ఝరీ లాస్యమ్మా, మైథిలీ కృ
పాత్త హృదంతర మ్మెదను, హత్తలేకను – నిల్చి తీవు! 91

వమ్మయ్యె యౌవన ప్రతిభ – వాసంత మధురమై, రసమ
యమ్మగు కవితా మనో హయమ్ములు గాక! వ్యుత్పత్తు
లిమ్మైన నీ కథా మధుర హేలా తరంగిణి గాక! –
చెమ్మగిల్లెను, కన్ను, లిట్టి జీవనమ్మును విధియింప! 92

ప్రారబ్ధ కర్మమ్ము పట్టి బంధించి, సంసార జలధి,
శ్రీరామ! మున్గి తేలెదను! శ్రీజానకీ మనో వ్యధల
సారమ్ము లీ కవిత్వమున, సరస గాథాబ్ధిగా నిల్చి,
నోరార కీర్తింప, – నా మనో కుహరమ్ము వెల్గింపు! 93

అబ్దమ్ము లసమర్థ జీవయాత్రల లోన, వార్ధక్య
శబ్ద వాచ్యమ్ముగా గడచు! శాశ్వతమ్మగు రామగాథ –
శబ్దార్థ రమ్య, రసార్ద్ర సాహిత్యఝరులుగా, కవిత
లబ్ధి కన్యక, మానసాబ్ధి లందింప – తపమీవె! ప్రభువ! 94

కుడితిలో బడ్డ మక్షికము, కుహనా మనోజ్ఞ మీ మనము!
అడియాసలే మిగులంగ, యాతనా భరము జీవనము!
ఒడిదుడుకైన పథమ్ము, లోర్వంగ లేని వేదనలు!
'అడియేను దాసుండ!' నీ దయా భిక్షకోరు దీనుండ! 95

భక్తి సిద్ధాంజనమ్ము, రస బంధుర కవితా తపమ్ము,
రక్తి గట్టించు నంచు, ధ్వని రమ్య కావ్య జగత్తులోన,
ముక్తి కాంతా మనః పథ విభూతి వెల్గుననుచు, పురుష
సూక్త నిగూఢ భావమ్ము - సొంతమౌ నన్నదీ, - భ్రాంతి! 96

మిత్ర భావమ్ముగా వచ్చి, మిథిలా సుతా మానసాత్త
చిత్ర విషాద భావనలు, శిల్పమ్ముగా, కవితా ప
విత్ర తపమ్ముగా - హృదయ వీథులనిల్చె; రసార్ద్ర
మైత్రీ గళమ్ము ధ్వనించె, మాధుర్య గాథగా! రామ! 97

మిడిమిడి జ్ఞానమ్ము మనసు మిన్నున నిల్వంగ, - శ్రుతుల
కడలిని - నిన్ను చేరంగ, కవితా తపమ్ము, - రసమ్ము
లొడిసి పట్టిన శిల్ప మనుచు, - ఓ స్వామి! కడు భక్తి తోడ
గడగితిని, రచింప, రామగాథ! నైరాశ్యమే నిల్చె! 98

మమకార పాశమ్ము నన్ను మఱి మఱి బంధింప, వార్ధ
కము, భ్రమలోన ముంచి, రస కావ్య నిర్మాణ పథమ్ము
లమరు తపమ్ములన్ మఱచి, యాంత్రిక జీవనమ్మునను,
తమములో, లీనమ్ము నగుదు! దాశరథీ! కృపా జలధి! 99

అతసీ కుసుమముల మిసిమి అందగించిన మేని, స్వామి!
వెతలు, చీకట్లు, నాహృదయ వీథుల గ్రమ్మి, యజ్ఞాన
శతకిరీటము దాల్తు! కవిత సాగింతు, తపముగా, నీదు
కతలు, రసార్ద్ర ధునులుగ, కాంతా మనశ్శోక ఝరిగ! 100

విశ్వాసమే జీవమౌచు, వేల్పైన యధ్యవసాయ
మాశ్వాసమున్ జేయ! హృదయ మందు భావసుమము, నీదు
నిశ్వాస సౌరభాత్త రమణీయమై, కవితాతపమ్ము
లాశ్వాస పర్యంత రస విహార స్రవంతులు నయ్యె! 101

అమ్మకొని తనువు, మనసు లమ్మకొని, పదవి లోన -
సొమ్మనే చేయక, ముదిమి సోకిన వేళ, చీకట్లు
గ్రమ్మనే? నేడెట్లు, ధనము రమ్మన్న దావచ్చు? రామ!
అమ్మకే లేదు! పిన్నమ్మ కదియెట్లు దిక్కన్న రీతి?! 102

ముప్పది యైదేండ్ల బ్రతుకు ముమ్మరమ్ముగ వృత్తిగొల్చి,
తిప్పలన్ బడిపోతి! తుదకు దేహమ్ము మనము క్షీణించె,
నప్పా! సహస్రాంశమైన, హా! స్వామి, నీ పాద సేవ
లొప్పుగా జేయ ప్రారబ్ధ మొప్పదా? తీరదా వగపు? 103

నా కేమి? యౌవన ఝురులు నాట్యముసేయు, ప్రౌఢాంగ
నా కనీనికల లోనంచు, నాకేమి? ప్రాతిభాత్తరచ
నా కమనీయవాహినులు, నా స్వామి గాథాబ్ధులై, ర
సైక మనోజ్ఞ తపమ్ములై, చెలంగు ననుచు, - భ్రాంతి! 104

పసితనమ్మున బాల్యమంచు, ప్రౌఢ, యౌవన దశ లోన,
మిసిమి ప్రాయము నంచు, వయసు మించిన కొలది, వార్ధకము
కొనదాక, వయసున్న దనుచు - కోర్కెల కడలిలో గ్రుంగి, -
రసిక శేఖర! నిన్ను తలప! - బ్రతుకంత చీకట్లు బలిసి! 105

ముప్పది యేండ్లయ్యె! ప్రతిభ ముమ్మరమ్మైన సమ్రాట్టు
లొప్పుగా కల్పవృక్షమ్ము హెయలు జగత్తునిల్ప!
చప్పనై, ప్రతిభా విహీన సమ్రాట్టునైన, నా తపము,
లెప్పుడు పండునో? కవితలే రీతి ధన్యమ్ములౌనా? 106

అతిలోక మానోజ్ఞ దృశ్యమౌ, నీ దృగంత కాంతులను -
మతిపోయి, మతిపోయి, భ్రమలు, మమతలు బాసి, నాయెదలు
సతి మనోగత విషాద భర సాహిత్యము, రసభరార్ద్ర
గతి, రమ్య తపముగా వెలుగ - కాకుత్స్థ! నీగాథ వినుతు! 107

జవ్వని సీతమ్మ కరుణ చైతన్య వంతునిన్ చేయ,
నవ్వులు పువ్వులై ప్రతిభ, నా కవిత్వపు లోతులందు,
జివ్వున రసరమ్య ధునుల జేకెత్తి తపములై వెల్గ -
బువ్వంపు బంతిగా - కథ - ప్రభూ! విన్నవింతును నీకు! 108

అవివేక మేఘమ్ము విరిసి, ఆషాఢ గగనమ్ము గ్రమ్మ -
భవబంధ నిర్ముక్త పథము - భావనా తిమిరజాలమ్ము
అవిరళమ్ముగ నింప, - హృదయ మందున, నీ కథామృతము -
కవితగా, తపముగా చేయ, కాకుత్స్థ! శక్తుండగాను! 109

దర్పబుద్ధి, నహంకృతు, మమతావిమోహమతిని, కాల
సర్పదంష్ట్ర విశీర్ణతనుని - సాహితీలోక మహార్ధ
తర్పితమ్మగు, రసార్ద్ర కవితా తపమ్ముల - చేతునెట్లు?
అర్పితమ్మయిన కర్పూర మట్లు, - లో, కాల్పవేమి? 110

నా మనోరథము లభింప, నాదు సంకల్ప మహాశ్వ
గామినగుచు, భవద్దివ్యగాథల, రసరమ్య భావ
నా మహార్ధ తపమ్ముగాగ, నా కవితా స్రవంతులను,
శ్రీమనోగత విషాదమ్ము చిత్రింప, యత్నింతు రామ! 110

చదువు సాగగ లేదు, మధుర సాహిత్య సంపన్న మౌచు!
పదవి, పెంపును లేదు. ధనము బంధమ్ములును గాగ! కవిత -
లెదబొంగి, ప్రాతిభాధ్వముల నెనయు భక్త్యబ్ధి గాలేదు!
ముదిమి ముంచుక వచ్చె, తుదకు ముక్తుండ నెట్లౌదు? రామ! 112

ఆది మధ్యాంతమే లేని, ఆగమ పురుషార్ధ రూప!
యోధాగ్రగణ్య! సుధాపయోధి తరంగ డోలా వి
నోద కేళీ విలోలా! మనోజ్ఞా నుభూతిప్రకాశ!
వేదనా మధ్యాక్కరల - నివేదన, స్వీకరింపు! ప్రభు! 113

చేదు నిజములోయి! బ్రతుకు, - చీకట్ల వెల్లువ నింపు
గాథలీ జీవిత కథలు! కాకుత్థ్స! యెద యెల్ల బిండు
బాధలే, మలిసంజ దాక, ప్రారబ్ధ కర్మలై పట్టు!
వేదనా మధ్యాక్కరల - నివేదన - స్వీకరింపు! ప్రభు! 114

ప్రోది చేసిన భావలతలు, ప్రోషిత భర్తృక లయ్యె!
నాదన్న ప్రాతిభారమ్య నాద తపమ్ము - విషాద
గాథలే సృజియించె రామ! కానలో గోడునౌ, నాదు
వేదనా మధ్యాక్కరల - నివేదన - స్వీకరింపు! ప్రభు! 115

చీదరించిన గాని, నన్ను సిగ్గు లేదన్న వాడన్న -
పేదరికమ్మది, యెదల బీడుగా నిల్పంగ గాని, -
పోదహెూ! ప్రాణమ్మ! మొండి పుట్టుకై మెలగు నీ, జీవి!
వేదనా మధ్యాక్కరల - నివేదన - స్వీకరింపు! ప్రభు! 116

క్రోధమ్ము, లభిమాన సహిత రోషమ్ములే, లేని బ్రతుకు,
సాధించి, యేదైన ఘన యశస్సును పొందగా లేని,
గాథగా, జీవన పథము, కంటకావృతమయ్యె! నాదు
వేదనా మధ్యాక్కరల - నివేదన స్వీకరింపు! ప్రభు! 117

పిలువని పేరంట మనుచు, ప్రీతిలేదని - నిన్ను కొలువ,
నలుక చెందంగ బోకు! యెద యందున భక్తిభావనల
నిలుపగా, కవితా తపమ్ము, నీ గాథలై, రసార్ద్రధుని,
జిలుకగా - మలిసంజ - ధన్య జీవుడ నౌదురా! రామ! 118

ప్రోది చేసితి, ప్రాక్తనవిధి, పువ్వులో గుమ్మడి పాదు -
'ఆదిలో హంసపా' దన్న యట్లు - గుమ్మడులు, ముమ్మడిగ
చేదైన పిందెలై విరిసె, చీకట్ల పండ్లయ్యె బ్రతుకు!
వేదనా మధ్యాక్కరల - నివేదన - స్వీకరింపు! ప్రభు! 119

వేదమ్ము లుద్ధరింపంగ, విపుల మీనమ్మువై జలధి
నీదులాడిన సోమకారి! ఇహ పర సారమ్ము భావ
నోదధి నింపి, భక్తిరస మొల్కించు, కవితాతపమ్ము –
వేదనా మధ్యాక్కరల – నివేదన – స్వీకరింపు! ప్రభు! 120

మంథరాద్రిని, నిల్పు ఘన కమఠమ్మై కుదురుగా, నమృతము
సంధించి, సురల ద్రావించి, సాగరాత్మజ పెండ్లియాడి,
బంధమ్ములన్ ప్రణయాప్త బంధువౌ కూర్మావతార! –
వేదనా మధ్యాక్కరల – నివేదన – స్వీకరింపు! ప్రభు! 121



కవ్వమ్ముగా మంథరాద్రి, కమఠమ్మై నిల్పి, క్షీరాబ్ధి,
బువ్వంపుబంతి, నమృతము పాల్పుగా బంచు మోహినివి!
రవ్వంత నీ కృపా రసము, రసరమ్యగీతియై వెలుగ –
నవ్వించు కవితా స్రవంతి, నా నాథ! నీ కథా జలధి! 122

మేదిని, నొక రక్కసుండు, మిగుల హింసింప, వారాహ
మై దంభమున్ చూపి, యసురు మెట్టువెట్టి, పుడమి నెత్తి –
నాథుడై నట్టినీవు! – రచనా చమత్కృతి, తపమ్ములగు,
వేదనా మధ్యాక్కరల – నివేదన – స్వీకరింపు! ప్రభు! 123



వేదవిహిత, దాన గరిమ, విఱ్ఱవీగిన బలి, – రాక్ష
సాధము నణప, – వామనుడ! – సాధు విప్రుని రూపు దాల్చి,
పాదమ్ములన్ త్రిలోకమ్ము బట్టు త్రివిక్రమ! – నాదు
వేదనా మధ్యాక్కరల – నివేదన – స్వీకరింపు! ప్రభు! 124

క్రోధమూని, మదాంధుడైన, క్రూర హిరణ్యకశిపుని, –
నీ దయార్ద్రిని, వానిసుతు, వినిర్మలాత్ముని, ఏచెడి, –నను
రాధమున్, జీల్చు – నృసింహ! యాచింతు నీ కృపాధునుల!
వేదనా మధ్యాక్కరల – నివేదన – స్వీకరింపు! ప్రభు! 125

నాథు చంపగ, తల్లి యార్తనాదమ్ము చెవిసోక, నెదల
బాధగా, పరశు వెత్తి, క్షితిభర్తలన్దున్మి, నెత్తురుల
నీదు పితౄణమున్ దీర్చి, నిల్చిన భార్గవరామ! -
వేదనా మధ్యాక్కరల - నివేదన - స్వీకరింపు! ప్రభు! 126

ఆదిలో కైకేయి ప్రేమ లందిన కొడుక! గాధేయు
బోధలో, చాపవిద్యా ప్రపూర్ణుండవై క్రూర రావ
ణాదులదున్మి, భక్త జననాథుడై వెల్గు శ్రీరామ!
వేదనా మధ్యాక్కరల - నివేదన - స్వీకరింపు! ప్రభు! 127

మీదు కట్టిన పాలతఱక మెసవి, గోపికలతో, వేణు
నాదాప్త శృంగార మొలికి, నాయకుండ వగుచు, గీత
బోధించి, ఉపనిషత్సార భూతమ్ము కృప సేయు కృష్ణ! -
వేదనా మధ్యాక్కరల - నివేదన - స్వీకరింపు! ప్రభు! 128

మేదినీ కాంత, మున్వీడి, మేటియౌ బోటి, త్యజించి
వైదికాచారమ్ము వదలి, వనిలోన సన్యాసి యైన -
బోధిసత్త్వుని, అహింసా ప్రభోధకాగ్రేసరుని, కిదె -
వేదనా మధ్యాక్కరల - నివేదన - స్వీకరింపు! ప్రభు! 129

గాథయౌ నీ శౌర్యదీప్తి! కల్క్యవతార విశిష్ట
సాధనా పరమార్థ! నిగమ సంధాన తురగాధిరూఢ!
యోధాగ్రగణ్య! జీవన మహోదధీ చంద్ర! నాదైన
వేదనా మధ్యాక్కరల - నివేదన - స్వీకరింపు! ప్రభు! 130

వేదామృతాంభోధి చంద్ర! వేంకటేశ్వర! సప్తగిరుల
పై, దేవళమ్మందు, మూర్తివై యాపదోద్ధారకుండ
వై, ధర్మరక్షణ సలుపు వైకుంఠమూర్తివై, స్వామి! -
వేదనా మధ్యాక్కరల - నివేదన - స్వీకరింపు! ప్రభు! 131

వేదార్థసారమ్ము లింత వినిపించనట్టి శైశవము,
సాధింప నేమియున్ లేని చప్పనిజీవనోపాధి, –
గాథామనోజ్ఞ, రసార్ద్ర కావ్యతపమ్ము – నాదైన
వేదనా మధ్యాక్కరల – నివేదితమయ్యె! శ్రీరామ! 132

వ్యాధియున్ జరయు, పీడింప, వయసు ప్రొద్దును వ్రాల, ప్రాతి
భోదయ కవితాతపమ్ము–భూసుతా మానసాంతర, వి
షాద గాథలను వినిచి, రసార్ద్రతల జిలుకు – నాదు
వేదనా మధ్యాక్కరల – నివేదన – స్వీకరింపు! ప్రభు! 133

మఱిమఱి కోరుచు, తృప్తి – మాత్రమ్ము లేని, మూర్ఖుండ!
పరగడ్పు నిత్యమ్మునైన పాపకర్ముండ! మీరేమొ?
చిఱుసేవకే పొంగి, భక్తి సేవించు వారినే ప్రోచు
పరమ కృతజ్ఞతాభావ బంధురులంట! శ్రీరామ! 134

మమతలు, బంధాలు, పాశమాత్రమ్ముగావు! నీ చరణ
కమలాప్త భృంగ ఝుంకార గాన న్నిర్ఝరుల గ్రోలంగ!
తమిదీర శ్రవణేంద్రియమ్ము ధన్యమ్ము నొందంగ లేని
భ్రమల పుట్టిల్లుగా చేయు ప్రారబ్ధ కర్మమ్ము! రామ! 135

ఒకటంచు తలప, వేఱొకటి యొదవి, నట్టేట ముగ్గితిని!
ప్రకటమ్ముగా ప్రతిభాత్త భావన్నిర్ఝరులు, రసార్ద్ర
వికసిత కావ్యజలధుల విలసిల్లబోక, నీ కథగ–
తికమిక లయ్యె నాబ్రతుకు! దీనాతిదీనుండ! రామ! 136

పిదప కాలములోన, పువ్వు–పిందెలై, కాయలై విరియ,
సొదలుగా, కథలుగా బ్రతుకు సోదెకే రాకుండ నిలిచి, –
ముదిమివేళల నాదు కవిత – ముగ్ధమోహన రామగాథ –
లొదుగునా? రసరమ్య ప్రాతిభోదయ కావ్యతపాన? 137

సుతులకై, సతికినై, తనయ శోభామనోజ్ఞ సంగతికి
బ్రతుకంత తలపోసి, వయసు రవ్వంత, మమతానుబంధ
గతికి, దూరమ్ముగా పోక, గడపి – వార్ధక్య సింహమ్ము
మతిలోన గర్జింప, – బ్రతుకు మఱలింప నౌనె? శ్రీరామ! 138

ఒకటి భక్త్యాంకురమ్ము – ప్రతిభోత్పన్న కవితాతపమ్ము
లొకటి – రెండింటినో రామ! యుష్మదర్పితమొనరింతు!
ప్రకటీకృత మనోరథమ్ము, ప్రాక్తన జన్మఫలమ్ము, –
సకలమ్ము నీ గాథలై, రసభర కవిత్వమ్ము నిలుపు! 139

సిరులు పొర్లగ లేదు, ప్రతిభ చెందగ లేదు కావ్యాత్మ!
ఒరగ బెట్టగలేదు పదవి, హెూరయ్యె, ముదిమి, – నా బ్రతుకు
జరుగు టెట్లన్న భయము, నిజమ్మనై, కవితాతపమ్ము
విరియకే రసరమ్యగీతి, విహ్వలుండైతి నోరామ! 140

నీ చూపు లతిలోక కృపలు నిండిన పండు వెన్నెలలు!
నీ చేత లరికంఠ దళన నిర్భర వీర కృత్యములు!
నీ చారు పదపద్మ రుచులు నిత్య భక్త్యానంద ఝురులు!
నా చేతనౌనా? రసార్ద్ర నాదస్వరూప! నిన్పొగడ? 141

అభిషేకమన నీకు, పరమ హర్షమ్మటంద్రు! శ్రీలింగ!
ప్రభువైన రామునికి సుమ రమ్యమాలలు మెఱుగంట!
అభినవ భావార్ద్ర కవిత లల్లిన తపము లిర్వురికి
శుభమంట! కవితాభిషేక శోభలే మీ కనురక్తి! 142

అడ్డైన ప్రతిపనియు, మనసడ్డు కొనంగ, నాకెదియు
గడ్డైన కార్యమై, కలగె కావ్యతపమ్ము! కాకుత్థ్స
మడ్డైన మానస ఝురులు మందాకినీ స్వచ్ఛమొలుక –
నొడ్డైనజేర్పవే! రస మహెూజ్జ్వల భావాబ్ధి వెలుగ! 143

*మనసు ముందుకు రాదు నీ కథామృత మాధుర్యమొంద!
కనుల మసకలు గ్రమ్మె, - రసఝురుల నీ గాథ వర్ణించి,
నిను గొనియాడ నేర! ప్రభువా! రమణీయ శబ్దార్థ
ధునులు పొంగవు, నా యెడంద! కవితామధువు లందబోవు! 144

*బాణాసురుడ గాను! కోటకాపుంచ బంటుగా శివుని!
ఏణాంకుడను గాను! నవ్వు వెన్నెలలేల శిరాన!
కోణంగి గంగ నే గాను! శివు, నెత్తి కూర్చుండి కులుక!
ప్రాణంబు లిచ్చు భక్తుండ! కవితా తపమ్ము లెడంద! 145

*నీవు, భోళాశంకరుడ వట! ప్రభువు నిర్హేతుకాత్త
భావనారమ్య కృపామహాబ్ధి! తపమ్ము - మనోప్ర
భావ, రసార్ద్ర కవిత్వమై, ప్రతిభాసముపాత్త
రావమై - రామకథామృతమ్ముగా రంజిల్లు నెపుడు! 146

*అంకితమ్మిచ్చె కావ్యమ్ము గురువు శివార్పితమ్మనుచు!
అంకితమ్మేల నా కవిత? ప్రాణమ్ము లర్పింతు నీకు!
లంకాధినాథు ప్రాణమ్ము దీయు హేలామనోజ్ఞకథ -
నంకితమ్మిత్తు నాయనకె! మీ యిద్దరన్యోన్య మనుచు! 147

*నీల గళుండవు నీవు! రమణీయ నీలాంబుదమ్ము
శ్రీలలన పతియు, - గరళ కంఠమ్ము, శ్రీరమ్య నయన
లోల తరంగ సంభృతము, - లిర్వురి లోన జ్వలించు!
లీలగా నిద్దఱై, మూల మొకటైన లింగస్వరూప! 148

*సాకేత రాముండు, - భక్తిరస రమ్యసాహిత్య కృషిని
నాకైత కాధారభూతమై వెల్గు - నందన వనిగ;
శ్రీకాంత మనసు లోతుల - విషాద రాశీభూత గాథ -
లోకైక కోదండ రామకథగ, నాలోన, జ్వలించు! 149

*నవ్విన ఈనాపచేల – పండె నానంద సస్యములు!
ఉవ్విన మాత్సర్య శిలలు, పువ్వులై, రోచిస్సులొలికె!
క్రొవ్విన దౌర్భాగ్యవిధియు, నిలువునా క్రుంగె, నీనాడు,
బువ్వంపుబంతి, నీకృపలు, కావ్య తపోరమ్య ఝరులు! 150

సవ్వడి గానీక, గోప సంసార సతుల, నేఁప్రొద్దు
కవ్వమ్ముఁచిలుకుచుండంగ, కాజేతువా? వెన్నముద్ద!
నవ్వులై వెన్నెల, హృదయ నందనమ్మెల్ల, – గోపికలు –
మువ్వగోపాల! నీదు నగుమోము క్రోలెదరు సుధలుగ! 151

*ధనము లేదని, జరారుజల తోడ వార్ధకము బాధించు
నని, మనసెల్ల సంసార బంధమ్ము నందు జిక్కునని,
ఎనలేని నీకృపలు రస రమ్యమై యేల, – నా తపము –
జనకాత్మజా శోక కథ, – ధ్వనింప, –రచన సేయ–భయము! 152

*పదితల లంచును, జానకీసతి పట్టెననుచు, శ
పథము చేసితివట! 'రావణాధము, బాణాగ్ని జిమ్మి
వధియింతు'నని – దశకంఠ ఘోష – నా స్వామి! యెడంద
బదిలమగు నను, – దహింపు! ఘోర పాపాత్ముడటంచు! 153

*ఖర విరాధుల చంప, దండక వనమ్ము నందు, కోదండ
ధరుడవైతి, – వెడంద యడవి! తద్గత ఖరవిరాధులు – అ
సురు, లరిషడ్వర్గమైరి! చూడవే! నన్ను కాపాడ; –
శరము సంధింపు శ్రీరామ! సద్గతిని బ్రతుకు నిల్వ! 154

ముంపులై మమతానుబంధములు, హృదయాంతరాళమ్ము
కుంపటై శోకాగ్ని లెగయ క్రుంగెద! జ్ఞానవైరాగ్య
సంపదల్ విరియ, తపమ్ము సాగింతు కవిత, – రసమ్ము
లింపులై నీకథామృతము లేలంగ, – భక్త్యాత్మనగుచు! 155

*నేను నిమిత్తమాత్రుండ! అతి రమణీయతపమ్ము
లేను, కవన రూపమున నొనర్ప – నీ హేలయే గద! న
వీన, విషాద గానమ్ము వినుతు, – హృద్వీథి, నీగాథ
గా, నళినాక్షి శోకాత్మగా, రసకావ్య నిర్ఝరుల! 156

*సుతులపై, తనయపై నింత మమత బెంచుకొని, నేనిట్లు
గతుకుల బ్రతుకులో బడితిరా! రామ! కవితాతపమ్ము
సుతరాము, నీగాథ యగుచు, మధుర రసోదధిగాదు!
మతివోయె నీ వార్ధకమున! నన్నెట్లు మన్నింపగలవు? 157

*చెలియ నయనము, సౌందర్య నిధిగ, పిచ్చిని, ధనుర్దాసు –
వలపుల వలలోన జిక్కె! శ్రీగురువర్యు సత్కృపల
గలిగె – శ్రీరంగనాథు నయనాల వెల్గందు సుకృతము!
మలి సంజలో నైన మమతలన్ బాపి, మన్నించు, రామ! 158

*చుట్టమ్ములీ క్రోధ, కామ లోభాలు శోభిల్లి యెడద
పట్టుక వ్రేలాడె దీ ప్రపంచమ్మె, భాగ్యమ్మ ననుచు!
నట్టేట ముంచితివి, కవితాత్మ – నిన్నొందకుండ – నిక
కట్టడి సేయరా! మనము, శ్రీకాలకంఠ! నిన్బట్టు! 159

*ఈనాటి, కీనాటికైన, వైరాగ్యమేచి, నిన్నొందు
కోనైన జ్ఞానమ్ము నొంది, కవిత – లోగుండెలో తపము
నై, నీ కథ, ప్రతిభాత్త, రసరమ్యగానాబ్ధిగా బల్కు,
నానంద మీ మలిసంజ – నను, స్వప్న మాయెరా! రామ! 160

*ఈ మమతానుబంధమ్ము, లీ,వల, పిట్టి, శృంఖలలు
కామపరవశుగా జేయు నో రామ! కవితా తపమ్ము
నా మనమ్మున వేలయై రసార్ద్రగానమ్ము నీ గాథ
యై, మలిసంజ నీ బ్రతుకు పండునా? అద్వైతపథిని! 161

*తేలికేమియు గాదు బ్రతుకుపై నున్న తీపి, - నే త్రుంప?
నాలుకపై నాడు భక్తి - మనసులో నన్యానురక్తి!
కూళనై సంసార జలధి మున్గి, దుఃఖోపహతుండ!
డోలగా నూగు నా మనము! పరమ మూఢుడను! శ్రీరామ!. 162

*అన్నియును వదలి నీ పద ధ్యాన మందుండి, కొల్చు
చున్నంత లోన - వేదనలు వేల్గలై సుడులునై యెడద
భిన్నమ్ముగా జేయు, తమము, భావనా వీథులన్ గ్రమ్మ,
నిన్ను కీర్తింప లేని కవితా తపో నిర్వేద మెసగు! 163

*"దిన దినమ్మును జీవితాధ్వమెల్ల, సందేహ నివృత్తి
గనక, తమమ్ము లెడంద నిండు! నిష్కామ కర్మమ్ము
లను, కవితా తపమ్ములను, నాదు కళా హృదంతరము -
'హనుమ' వోలెను, యోగసిద్ధి నొందునా?" యని - భ్రమ! రామ! 164

*క్రిందునై మీదునై బ్రతుకు విధి వైపరీత్యమున, తల
క్రిందుగా భాగధేయమ్ములగుచు, వక్రించె వార్ధకము!
ముందు వెన్కల నూగు నా మనోగత ముగ్ధ కావ్యాత్మ-
పొందగా లేక తపమున సవిషాద, భూజాత గాథ! 165

*ముందు వెన్కల నూగు నా మనః కపి ముదిమి కొమ్మలను!
సుందరి, సీత, మనోగతాధ్వమ్ము, శోకరసార్ద్ర
బంధుర కావ్యతపమ్ముగాలేక, భావనా ఝరులు-
సుందరకాండగా మిగిలె, మలిసంజ, శోకాబ్ధి మున్గి! 166

*ముప్పదేండ్లకు పైన పదవిపై భ్రాంతి, మూఢుగా నిల్ప -
తెప్పరిలగ లేక, తనువు, మానస దీప్తి, హరింప,
తప్పయ్యె జీవనయాత్ర యని - కవితా తపస్సిద్ధి
ముప్పయ్యె ముదిమి నంచనుచు, తలప నే - 'ముద్దాయి'నౌదు! 167

*సిరులకై, పేరుకై, జీవయాత్రల జిల్గు వెల్గులకు,
నిరతమ్ము పోరాడి, తనువు అలయంగ, నిల్వనా క్రుంగి
విరమించి కవితా తపమ్ము ఫలియించు వెఅవు లందకను,
నరక యాతన లయ్యె వార్ధకాన! శ్రీనాథ! రక్షింపు! 168

ఊబిలో జిక్కి పాదమ్ములూది నిల్వగ లేక, నిలువు
నా భయమేచి, కూరుకొను నా బ్రతుకు విషాదజలధి!
శోభిల్లు రసరమ్య కథన సుందరగాథ, నా గళము
లో బొంగి, కవితాతపమ్ములో పండి, వెలిగింపనిమ్ము! 169

*క్షణమును, నిముసమ్ము, ఘడియ, దినము, మాసమును, వర్షమ్ము
గణన కెక్కగలేని బ్రతుకు నిన్నాళ్ళు గడపి, వ్యర్థముగ -
మణిపూసయై కవిత్వమ్ము, నవరస మధురగీతముల
గుణకీర్తనమ్ము సేయంగ, ముదిమి, నిన్గోరెదో, రామ! 170

సూర్యరశ్ముల సోక నీను! సుందరమ్ముగ నుందు నేను!
వీర్యవంతుడగాను! హృదయ వీథుల క్షమ నిల్పబోను!
ధైర్యమ్ముగా నిల్వలేను! ధర్మనియతి తప్పెదేను!
కార్యశూరుడ గాను! భ్రష్ట కర్ముడ నేను! శ్రీరామ! 171

బండఱాయిని గాను! పాదపద్మమ్ము సోకి, నే బ్రతుక!
పండితుండను గాను! వేదపఠనాన, నిన్ తృప్తి జేయ!
చండ రాక్షసు గాను! స్వామి! శరముతో నిర్జీవు జేయ!
మొండిగా కవితా తపమ్ము మూర్ధన్యమైన, భక్తుండ! 172

*ఎల్ల సంసార బంధమ్ము మమతాబ్ధి లేచు సంభ్రమము!
చల్లగా నీ మృగ తృష్ణ ననలునై సాగి, జీవితము
కల్ల గాదనిపించు! తుదకు బ్రతుకులో గాఢాంధ్య మెగసి,
ఝల్లుమన నెడంద రామ! తపము నే సాగించుటెట్లు? 173

*తల్లి గర్భములోన, వీర్య శుక్ల సంధాన సంబంధ
మెల్ల బీజమ్ముగా వెలసి, పిండమ్ము లెసగు రూపంది,
వెల్లువౌ నుదర కోశమ్ములోన, ఉద్విగ్న భావమ్ము
లల్లుచు నిదురించు, శిశువు – నా తొలి హాస్యమ్ముహేల! 174

*పిల్లచేష్టల తోడ, తల్లిదండ్రుల ప్రేమ పండించి,
మెల్లగా విద్యలన్ నేర్చి, పీయూష మిళిత శృంగార
సల్లాపముల దేలి, విషయ సంసార సాగరోత్తుంగ
కల్లోల భంగ మగ్నుండ నగుచు – నిన్గాననో రామ! 175

*తాపత్రయమ్ముతో, బ్రతుకులో గాఢతమము లెన్నాళ్ళు?
పాప కూపము లోన మున్గుటెన్నాళ్ళు? భవబంధ ముక్తి
కై, పనిగట్టి భక్త్యధ్వముల పోయి, కావ్యతపమున,
శ్రీపతిని, రసార్ద్ర రమ్య సుమమాల – సేవించు టెపుడు? 176

*మనసులో నాకమూల నణగి యున్నది – మమతానుబంధ,
మనురాగ జలధులన్ తేలి! బ్రతుకులో యాంత్రికోద్యోగ
మెనలేని బంధాల జుట్టి, మాయలో నెదిగి – భక్త్యాత్మ
నిను గొల్వగా లేని, దుర్విధుల మున్గి – నిలుతునో రామ! 177

*జవసత్వము లుడింగి, ముదిమిని, తిమిర జాలమ్ము గ్రమ్మి,
అవరోధ భంగమ్ము హృదయ సాగర మందు నుప్పొంగి,
కవితయే తపముగా, రసమయమ్ముగ, కాకుత్థ్సకథల
భవబంధ ముక్తికై భక్తిగీతాల పాడగాలేను! 178

*ఓటములు, కనుముందు, బుజువౌచు, మోహౌద్ధృతి నణప,
పోటరుల వలె విక్రమము చూపించి పోరు రాక్షసుల
ధాటికిన్ నిలువంగ లేక కలగు సద్ధర్మ వల్లేను,
నేటికీ, కవితాతపమ్ము, సిద్ధింప నేరకే వగతు! 179

*కుంభకర్ణుడ, నహమన్న నిద్రలో గూరి, క్రోధోగ్ర
జృంభణమ్మున, ఇంద్రజిత్తు నగుదు! విజ్ఞృంభింప, మాయ
గుంభనగ నసురత్వమిది, నాలోన, గూడు కట్టె, నిక
స్తంభింప జేయు కోదండ రామ! నా దైత్యాంతరమ్ము! 180

*ముందు గౌతమి, కృష్ణతల్లి, పెన్నమ్మ, ముచ్చురు కూడిన, యె
డందలో – నన్నయ్య, విశ్వనాథ, కళాబ్ధి తిక్కనల, –
నందనమ్మైన, నాదు కవితోద్యాన నవసుమమ్ము – రస
బంధుర రామకథా మధుర, సౌరభాబ్ధి యగుత! 181

మమత పద్మవ్యూహమ్మై యమరినంత, అభిమన్యువోలె
నిమిడి పోలేక, వెలికిని నెగ్గలేక తికమిక బడి, –
సమర రంగాన నోటమిని చత్తు! నీ కరుణా దృగంత
మమరి, వైరాగ్య పథమ్ములందు కవిత్వమ్ము నిల్పు! 182

*మంచు కుఱిసి, కుఱిసి, మనమెల్ల హిమమ్ములన్ ముగ్గె
నంచు, శోకించు మూర్ఖుండ! కవితాత్మ లందగా తపము,
మించదా నాదు రామాయణము – రసమిళిత కావ్యముగ?
వంచిత భాగధేయమ్ము లయ్యె, నీ వార్ధకమ్మునను! 183

పెంచుకొన్న కొలంది, పెఱుగు పిచ్చిగా, మమత లెడంద!
వంచిన తల, మఱియు తలవంపుగా నగు, దుర్విధులను!
సంచిత ప్రారబ్ధ కర్మ సాగనీయదు నా తపమ్ము!
త్రెంచుకోలేని బంధముల ద్రిమ్మఱి నైనైతి, రామ! 184

కరగ దీయుచు నున్న నెంత గట్టి కొండయు నైన, తుదకు
కఱగి నీరౌను అన్నట్లు, కాలకర్మ వశత, పాప
భరము పెఱిగి, కొండలయ్యె! భక్తితో, మది సానబెట్టి
కరగ దీయుచు నున్న తఱిగి, కవిత పండదా? తపోనిరతి! 185

ముందు వచ్చిన చెవికన్న ముమ్మరమ్ముగ నుండు కొమ్ము,
లిందు సందియ మేమి లేదు! ఎంత పెంచిన కన్నవారి
యందుండ దట! మగనిపయి యతివల కుండు ప్రేమమ్ము
లెందు భువిని! సహజ గుణమిద్ది, మానవ భావఝరిని! 186

బండమడ్డిని బట్టినట్టి బట్టరా! మనమిద్ది! బత్తి
బండపై నుతికి, సత్ప్రతిభ పండు, కావ్యఝరి, జాడించి
ఎండవేసిన, తపస్తీక్ష్ణ మేచి, పసిండి వెల్గులను
నిండునేమో గదా! రామ! నీ గాథ రసరమ్య జలధి! 187

*కుంభకర్ణుని వోలె హృదయ కుహర సంకుచిత జీవాత్మ
దంభముల్ వోవు, నిన్నెఱిగియును లెస్స తనలోన! దర్ప
కుంభాభిషేక నిమగ్నమతిని, నిగూఢ భక్త్యాత్మ
సంభవింపగ – రసార్ద్ర కవిత నొసగు! స్వామి! నిన్గొలువ! 188

*కామమ్ము, అలుక – ప్రహస్తదనుజాప్త కార్య నిమంత్ర
ణామృతము వలె, విభీషణాత్త నిర్ణయము నదల్చి, –
మామకీన హృదయ రావణుని ద్రోలు, మరణోన్ముఖముగ!
రామ! నీ శర పరంపరల ద్రుంపవే! రాగత్రయమ్ము! 189

*వెఱ్ఱి పదితలలు వేయు నసురు, నిర్వీర్యు జేయంగ,
చిఱ్ఱుబుఱ్ఱుమను కోతుల, నెలుగుబంట్ల, చెలిమి జెలంగు –
కఱ్ఱి రాముడ! ఇహలోక సుఖముల కామించి, ముదురు
వెఱ్ఱి, – సహస్ర శీర్షమ్ములైన – నన్, – విఱువంగ రావు? 190

రెంటికిన్ జెడిన రేవడను! రిత్తలై వృత్తిలో సిరులు,
కంటికిన్ నదురుగా బ్రతుకు, కన్పింపకున్న, కృశించి, –
మింటికిన్ మంటికిన్ నడుమ మిగిలె నా కవితా తపమ్ము!
పంటగా నీ గాథను, రసబంధురమ్మును గాక – వగతు! 191

తనువు బిగువులు, మనఃపథమ్ములు, ధైర్యముల్ - సడలి,
మనుగడలు వగపులై, అమాంతము బెబ్బులి పోలె,
నను, - వార్ధక మెగసి, గ్రమ్మ - నా గళమ్మున కవితాఝ
రిని, రసాబ్ధిగ, నీ కథా నిరీక్షణ సేతురా! రామ! 192

కొడిగట్టి యారి పోయెడిని, కోదండరామ! నా బ్రతుకు!
దడలు బయలుదేరగ - కవితా తపమ్ము ఫలించి, కథల
నుడివెదనో? - జననీ మనోగత వేదనా ధ్వనుల!
మడిగట్టి కూర్చుండి, నన్ను మన్నింప వేమిరా? రామ! 193

మిడిమిడి జ్ఞానంపు మెఱుపు మించిన వేళ - నాకన్న
కడుదొడ్డ దొర లేనె లేడు! కాలమ్ము వక్రించి, వగపు
కడలులై పొంగ, - నాకన్న - కన్నీరు గార్చు మూఢుండు,
పుడమిలో నుండగా పోడు! పూర్ణేందు శోభా ముఖాబ్జ! 194

పట్టి లాగుచు నుండె పాపపంకిల సరసి, నీ మకరి,
గట్టిగా బట్టె నా మనము, - కావ్య తపమ్మునే జేయ
బుట్టె నీ ముసలమ్ము, పూర్వ పుణ్యమ్ము లుప్తమై, రామ!
నట్టేట ముస్గు, నా బ్రతుకు! నాకిక లేదేమొ ముక్తి? 195

ఒక యూపులో పొంగి, కవిత లోక కొంతమేర; తపమ్ము
సకలమ్ముగా నీ కథను, రసభరమ్ముగ నొనర్తు! రామ!
ఒక ఊపులీ యెడందను శరోజ్జ్వల ఘాతాత్మ చేయ
తికమకన్ బడుచు, నిస్పృహల దీనుండనై విలపింతు! 196

*సుఖమేదొ గుర్తింప లేక - నీ కథా సుందరంబైన,
సుకవితా తపము సాధింపగా లేక, శోకానగ్రుంగి,
సకలమ్ము నిస్పృహా భరిత మనుచు - రసభరిత గీతి,
పికివోలె నే బాడి రామ! నిన్ను మెప్పింపగా లేను! 197

*కొకిబికి మేని, సుందరిని, ముదమార, కోమలాంగుళుల
చకితమ్ముగా తాకి, కుబ్జ - సర్వాంగ సౌందర్య జేసి,
వికసింప జేసి నావంట! నా మనో విహగమ్ము తాకి,
ప్రకటింపవే! నీ కృపా దృగంతాల ప్రజ్ఞామరీచి! 198

*బక రూపదైత్య సంహార, లీలా ప్రభావితానంద,
మొకయింత, గోపాల బాల లోకమ్ము లొప్పంగ జూపి, -
'నకిలీ'ని, నా మనోగోప శిశువు, నానంద కందళిత
వికచాబ్జ ముఖుని జేయంగ, శ్రీకృష్ణ! విముఖుండ వేల? 199

*మద్దిచెట్లను ఊటదాకి, విస్మయం బందు దృశ్యమ్ము
నద్దమ్ములో జూపి, మాతృహృదయమ్మునందు మోదమ్ము,
ముద్దు జూపిన -గోపికా మనోనాథ! - మున్గి, నే వ్యధల,
మొద్దునై యున్న నన్దాకి - భవబంధ మోక్షమ్ము నిమ్ము! 200

*మథియించి మథియించి వేదనోద్భృత మందరాద్రి - యెద -
బ్రిదిలె, నీ హాలాహలమ్ము! శ్రీకంఠ! ప్రీతి నీకిత్తు!
హృదయాన కవితా తప స్తరంగమ్ము - హ్రీముగ్ధ - సీత,
కథగాగ, రసగీతి పాడ - నీ కిత్తు కాకుత్థ్స! శరణు! 201

దినములు బాధాంధ భావ దీప్తమ్ములైన శ్రీరామ!
నిను మనసార కీర్తింప, నీ గాథ, నా కవిత్వఝురి,
ధ్వనిరమ్యమౌ ప్రతిభ రసవాహినులై వెలుంగకను -
జని వ్యర్థమై చనె నంచు, సంసారజలధి, - నే, వగతు! 202

*పాశమ్ములై ప్రేమ బంధములు, నను పట్టి, సతమ్ము
ఆశాతరంగ డోలానిమగ్న విహారునిన్ చేసి,-
లేశమ్ము నిను గొల్వనీక, తమము లాలింగనమ్మైన -
ఈశా! మహేశ! విముక్తి సిద్ధించు నే రీతి నాకు? 203

*కొండ చిల్వను పోని మాయ, మ్రింగు, నా గుండెలో వెలుగ.
కండ బలమ్ము మనోబలమ్ము నా కవితా తపమ్ము-
నిండుగా నీ కథాగానముల జేయ నీకుండె! వగపు
లండగా, బ్రతుకు చీకట్ల మున్గె నీశా! విధివశత! 204

*దీపావళులు, నాదు గుండెలో చిఱు దివ్వెలై వెలుగ,
పాపాల చీకట్లు పరువు లెత్తంగ, ప్రతిభా ప్రదీప్త
రూపమ్ములై రసధునులు, కవితగా రూపింప, రామ!
నా పల్కు భక్తి భావాబ్ధి యౌనట్లు నన్ను రక్షింపు! 205

*అంతమే లేనట్లు చీకటులు కవియంగ నల్గడల,
సుంతైన మనసులో శాంతి లేకుండ, శూన్యమ్ము దోచు!
కొంతైన నీ భక్తి - కవితగా వెల్గి, గుండెలో తమము
లంతమ్ముగా చేసి, నా తపమ్ము కథాబ్ధిగా నిల్పు! 206

*చదువులో, ప్రతిభలో, వెలిగి - యశమేమొ సాధింపలేదు!
పదవిలో పైపైకి, ప్రాకి, సంపత్తి, ప్రాప్తింప లేదు!
హృదయమ్ములో పొంగి, భక్తి - కవితగా సృష్టింపలేదు!
వ్యధలలో తమములో మున్గి, బ్రతుకంత వ్యర్థమై నిలిచె! 207

*కసిబూని కొఱడాల కొట్టినట్లుగ కలచె దుర్విధులు!
ముసురులై ముంపులై తమము, బ్రతుకంత మునిగె పెన్వగపు!
రసహీన కవితాతపమ్ము - ప్రతిభతో రాణింప లేక,
మసిపూసి మారేడు కాయగా - నన్ను మన్నించినావు! 208

*నామనసన్న క్షీరాబ్ధి ద్రచ్చగా - నవ్యసద్భావ
మేమొ? సురలు - దైత్యులందు, దుర్భావ మేచు పోటరులు!
ఏ మందరాద్రియో తెచ్చి మథియింపనేమి? విషమ్ము
లీ మనసెల్ల విరిసె! అమృతము జాడింత లేకుండ! 209

*హాలాహలమ్ము పుట్టంగ, నెగసె 'హాహాకార'మంత, –
కేళీ వినోదుడై శివుడు – ముద్దగా గీలించి మ్రింగె!
నా లోని శంభుండు కృప దలచి, మ్రింగునా? విషమెల్ల!
హేలా సుధా తరంగమ్ము లెడదలో, హ్రీముగ్ధమౌనె? 210

*గుండెలో దిగజాఱు మందరాద్రిగ కోటి భావనలు,
మెండైన మథనమ్ము చేయగా లేక, మిగుల దుఃఖితుడ!
కొండ పైకెత్తి – నీ గాథ రచియింప – కూర్మమ్మ వగుచు –
అండగా కవితా తపమ్ము ప్రోచవేమయ్య! సత్కృపను! 211

*వలిమల యల్లుండు విషము భక్షించె! వాగర్థశోభ
నిలుపగా కమఠావతారమై – కమనీయ కావ్యతప
ముల బ్రోవ – ధ్వని రమ్య ప్రాతిభా గీతముల నీ కథలను
లలిత సౌందర్య దీప్తి రస కావ్య మాలాపనన్ జేతు! 212

*తనువు బడలి, త్వగింద్రియము సడలి, సుతారమై బ్రతుకు, –
మనసు ముసలిదై, వయస్సు వ్రాల, నీ మలిసంజ – తిమిర
మున మునింగి, ప్రభువ ! భక్తి భావన, ముక్తి సాధనగ –
నిను కవితా తపమ్మున రసార్ద్రధునిగ – కననైతి! 213

*పారి పోవగ రాని ప్రణయ బంధమ్ము భావనా పథము,
తీర మెఱుంగని మోహ సాగర తీవ్రఘోషమ్ము
ఊరినన్ తఱుగు లేనట్టి కామలోభోగ్ర రసాబ్ధి!
సార విహీనమైనట్టి బ్రతుకురా! స్వామి! రక్షింపు! 214

*త్రెంపుకోరాని పాశములు, గుదిబండ రీతి, నన్బట్టి,
అంపంపు కోతలై తనువు హృదయాల ఊచగా, వగచి –
ముంపులై శోక విషాద భావనా ముగ్ధ నిర్ఝరులు,
కంపింప – నెట్లు కవిత్వ తపములో కాకుత్స్థ! పండు? 215

*వైరాగ్య మెట్టులైన కుదురు, తనువునన్ వార్ధక్యమేచ,
వైరాగ్య మసలైన మనసులో బుట్టి, వంపంగ వాంఛ –
శ్రీరామ! రసరమ్య గీతి పొగడంగ, – సీతామనోగ
తారామ సౌగంధ్య మెనసి, నా కవిత్వమ్ము ఫలించు! 216

*మన సన్న యెద్దు గానుగను 'గిరగిరా' మంత్రించినట్లు,
వనితపై, తనయుపై, పుత్రిపై, పెక్కు వలపులం బెంచి,
తన చుట్టు దాఁగంత కట్టి, లౌకికాధారమై తిరుగు!
నిను కవితాగాన తపములం గొల్వ నేరదీ మనసు! 217

*బిగబట్టి కళ్ళెమ్ము, మనసు గుఱ్ఱమ్ము – పీయూషమైన –
రఘునాథ! – నీ కథా కథన తపమేను – రసరమ్యగీతి
సొగసుగా, ప్రతిభాస్రవంతి, పొంగి రసోదధి జేయ
నగునె? వార్ధక్య వ్యాఘ్రమ్ము మ్రింగు నాహా! నను ముందె? 218

*అడ్డంకు లెక్కువై విఘ్న నిర్ఘరులందు మనమ్ము
చెడ్డ తలంపులన్ మున్గి – రసరమ్య శిల్పమౌ కవిత
దొడ్డ తపమ్ముగా నిల్పి, నీ కథా దుగ్ధమ్ము పిండి,
వడ్డించ పోదు, ధ్వని ప్రధాన కావ్యమ్ముగా, రామ! 219

*గాటిలో బడ్డ చక్రమ్ము తిరుగు, నే కదలికే లేని,
బాట దప్పని విధిగాగ – నాదగు బ్రతుకు వాగులును,
గాటనే దొరలు, నిస్పృహల – రసరమ్య కావ్యతపమ్ము
లేటికో? నీ కథామృతము అందకే, హ్రీముగ్ధుడగుదు! 220

*ఆదికవి, మహర్షి! కల్పవృక్ష కావ్య బ్రహ్మ, విశ్వ
నాథ సత్యకవియు, పుట్టపర్తి – జనప్రియ రామ
గాథ, – రసార్ద్ర రమ్యముగ రచియింప – కావ్యతపమ్ము
నాది, సీతా మనోగాథ – రుచియించునా? రఘురామ! 221

*పునరుక్తి దోషమ్ము పట్ట నేమౌను? పూర్వాఘ పంక
మున తేలుచున్నట్టి నేను, స్వామి! నీ ముగ్ధ సౌందర్య
మున జొక్కి, కవితా తపమ్ము పండింప, మోక్షార్థి నౌచు -
వినిపింతు రసరమ్య గీతి, ప్రాతిభా విఖ్యాత ఫణితి! 222

*వదలదీ వ్యామోహ తిమిర సంఘమ్ము వార్ధక్య వేళ!
కదలదీ హృదయాంతరాళ, వల్లకీగాన స్రవంతి!
ప్రిదులదీ కవితా తపమ్ము రసభావ పేశలమ్మగుచు!
మెదలదీ యజ్ఞాన హృదిని, దృఢ భక్తి మిళితమై యార్తి! 223

*బాల్యమ్ము నందొక్క తీరుగా దోచె, బాల మౌగ్ధ్యమ్ము!
లౌల్య యౌవన వేళ, తెలిసె - ప్రేయసీ లావణ్యగరిమ!
మూల్యమ్ముగా, ప్రౌఢ దశల - సంసార మోహమ్ము గ్రమ్మ
నైల్యాత్త వార్ధక్య మందు - కామార్తి నాశమ్మెౌనె? 224

*పిచ్చిగా ధ్యానింతు - యౌవనమ్మున ప్రేయసీ హృదయ
స్వచ్ఛతల్, ప్రణయ భావాబ్ధి గెరలు, నిస్స్వార్థ భావమ్ము,
లచ్చైన కెరటమ్ములంచు - దుర్విధీ హాసమ్ము లెడద,
హెచ్చుగా శోకాగ్ని ఱేప - ముదిమి నే హ్రీముగ్ధుడగుదు! 225

*తప్పేమి లేదేమొ? పసితనమ్మున తన్మయమ్మొంద!
ముప్పేమి లేదేమొ? యౌవనమ్మందు, ముగ్ధతల్ నెఱప!
గొప్పేమి లేదేమొ? ముదిమి వేళల కోరగా నిన్ను!
చెప్పరా? తప్పేమి? - చేరలేనైతి, శ్రీరామ! నిన్ను! 226

*బిగిసి కొనెడి మఱింతగను, మమతాప్త భీమశృంఖలలు!
ముగిసి పోలేదు - మోహాత్తభ్రాంతులీ ముదిమి వేళలను!
పగను వీడగలేదు - ప్రాక్తన జనిత పాప భుజంగి!
నగవులే లేవు, బ్రతుకున - కవితా మనమ్ము నిన్గనక! 227

*పుట్టబుట్టువు కవిత చదువంగ – లోబుట్టు కవిత్వ
మిట్టుల, రసరమ్య భావనోద్భృతు లెసగు న్ఝిర్ఝరిగ!
గట్టి పిండము విశ్వనాథుల కవిత గాంచంగ – భీతి
బుట్టెడి – దీటుగా నెటుల రచియింప పోలు నే ననుచు! 228

*దీపముండగ, నిల్లు చక్కబెట్టగ, దీటుయౌగాని; –
నా పని, – దీప మొక్కింత కొడిగట్టినంతనే, తేఱి,
నీపడంతి మనోగతమ్ము తెల్పంగ, నీ మలిసంజ
నోపనై తిని! రసార్ద్ర కవితా తప మ్మోయి! శ్రీరామ! 229

*మొద్దు వాఱెను పాడు మనసు! నీ నగుమోము గనంగ
వద్దులే! కవితాతపమ్ము లౌకికావధుల దాటంగ
వద్దులే! భక్తి రసార్ద్ర భావనా వాహినులు, మఱి
వద్దులే! నీ కథాగాన మాధుర్య వాంఛితార్థములు! 230

*నిదురవోయిన నా మనమ్ములోన – వీణియల మ్రోగించి,
ముదిత, – నీ గాథ, నా నోట పలికింప, ముగ్ధ మనోజ్ఞ
పథముగా, కవితా తపమ్మలందించె! భాగ్యహీనుడను –
మది నిన్ను నిల్పుకోలేక, వగతు! రామా! నిరాశలను! 231

*ఎంతకును తెగనివీ హృదంతర మేచు కోరికలు!
ఎంతకును విడనివీ యెడందల నేలు బంధములు!
ఎంతకును కననివీ కనులు నిన్నహీన తేజస్వి!
చింతింతు, చింతింతు! రామ! బ్రతుకన్న సిగ్గయ్యె నేడు! 232

*పట్టుకొని మమతాప్త మధు కలశమ్ము, పాపిష్ఠి మనము,
గట్టిగా లౌకికావధుల దాటి, నిన్గాంచగా లేక,
కొట్టు మిట్టాడు, నీ సంధ్యవేళ నో కోదండరామ!
ఱట్టు చేయక నన్ను, తపముగా, కావ్య రచనమ్ము నిమ్ము! 233

*గుట్టుగా ప్రతిభతో కప్పి, కవితలో గుప్పింతురసము,
నట్టులే, యావేశ భావనా ప్రవాహముల, శోకమ్ము
గట్టులన్ ద్రెంప, సీతమ్మ కథను, నే కావ్య తపమ్ము
లట్టుగా రచియింతు! ప్రభువ! మఱి బెట్టులన్ పోకు మింక! 234

*గుట్టుగా వ్యుత్పత్తి – ప్రతిభతో కప్పి, గుప్పింతు, తేనె
పట్టుల, రసరమ్య కవిత! ఉద్వేగ భావనా ఝురులు
గట్టులన్ ద్రెంప, శోకాబ్ధి – చెలియలి కట్టగా తపము
బట్టి, నీకథ రచింతు! జననీ మనోభావమ్ము వెలుగ! 235

*చిత్తమెప్పుడు లౌకిక ప్రవృత్తికిన్, చేజిక్కి, మనము
హత్తుకోదుర! కవితా తపమ్ము! అహమ్ము ఫణమ్ము
లెత్తి విషాగ్నుల బుసలు కొట్టు! నన్నేలు శోకమ్ము!
చిత్తజాజనక! కృపాంతరంగ! రక్షింపు, దీనుండ! 236

*వేదనా మధ్యాక్కరల, రసార్ద్ర నివేదన లొసగి,
సాధనా మహిత తపమ్ములను, ధ్వని సాహిత్యమెసగి,
బాధా హృదంతర దీప్తి, కరుణార్ద్ర భావమ్ము వెలిగి,
శ్రీధవా! నీ గాథ, మధుర భక్తి రచింతు కావ్యముగ! 237

*మత్త గజమ్మును పోలె నాదు నెమ్మనము, విశృంఖ
లాత్త ప్రవృత్తి చరించు! గండస్థలమ్ముల మదము
లొత్తుగా ప్రవహించు! మోహ కామమ్ము లొత్తుగా నిలుచు!
మొత్తి కృపాంకుశ మీ యెడంద, నా మొఱల నాలింపు! 238

*హత్తగా నొకవంక, ధరణిజ, – మధుర హాస రేఖాస
రిత్తు, వేఱొక వంక, మమత లొత్తిన రిత్తతపమ్ము!
చిత్తమ్ము దేవాసుర రణరంగమై, చిక్కులన్ బడుచు
కత్తిపై సాముగా, బ్రతుకు లోన, నే, కవిత సాగింతు! 239

*సాగు కొంతదనుక – తల్లి కరుణాప్రసార మహత్త్వ
మాగకే ప్రవహింప నెదను! కదలకే యారళ్ళు వెట్టు
నా గళమ్ము – రసార్ద్రభావనా ఝరీ నాదమ్ము నీ క
థాగానము లగుచు, నా కవిత్వ పథములో వెలుంగు! 240

వేదనా మధ్యాక్కర లివి! విరియు నీవేళలో స్వామి!
బాధలే మఱితురా! బ్రతుకు బరువుల పాటలే యెదల
గాథలై, కవితా తపమ్ముగా, రసగంగలై వెలసి –
శ్రీధరిత్రీ సుత, చిత్త సింధువులౌచు, ఘోషించు! 241

అన్ని నైవేద్యములు తమకనుచు, సమర్పించి జనులు –
కొన్నియైనను మిగుల్చకయె, కుక్షినింపెదరు సతమ్ము!
ఉన్న మనస్సుధాజలధి నుప్పొంగు పీయూష మెల్ల –
వెన్నగా జేసి, నీకిదె! నివేదన – కృష్ణార్పణమని! 242

పాడు వ్యామోహమ్ము, మమత, పైకొనంగను, నన్ను – గుండె
లాడునో రామన్న! – మద్దెలట్లు మ్రోగినటుల – శంభు
డాడెడివేళ, – క్షీరాబ్ధి యదర ద్రచ్చెడి మందరగిరి
యాడు వేళను – హాలహల మహానల మెగసి – కుత్తుకను! 243

జీవితమ్మన్న మఱింత చేదుగా తోచి, సంజలను,
నీ విలాసముల కేనొక్క నిర్ణీత వస్తువై, యాడు
కోవచ్చు ననుచు తలంచి, – కోదండరామ! ఈ పగిది
నా వాక్కులో – తల్లి వేదనలు, ధ్వనింపంగ చేసితివా? 244

*అహము వేరులు నాటి, హృదయ వన మృదులాంతరమ్మందు
సహ జీవనము సాగు – క్రోధ, లోభ సంసక్త సూనమ్ము
లిహలోక సౌరభ లహరులేచి! కేళీ మనోజ్ఞ! అహ
రహము ఊచు మెడంద, భక్తి మధుర మరందమ్ము చింద! 245

మలుపు దిరిగె రామగాథ, మహనీయ! నీ పాత్ర కాలు
నిలుప, తొలుత రంగమందు! నీరజాక్షు కనులు ముదము
లొలికె! లక్ష్మన్న యెడంద లొప్పుగ, శేషుని పడగ
వెలుగు జిలికె! కపిరాజు వెలిగె మైత్రికి దర్పణముగ! 246

ఎదురు చూచుచు నుంటి! హనుమ! ఇన్ని నాళ్ళేను, నీ పాత్ర
కథను మలుపు ద్రిప్పు ననుచు! కవిత, తపము గాగ, ప్రతిభ
లెదల విరిసి, గాథ – రసము లింపుగ, ధ్వనియించునంచు!
మధురమై సీత మనస్సు, మా రాము, కథ విన్చునంచు! 247

నీ ముందు కుప్పిగంతులను నే వేయ బోనురా! హనుమ!
నా ముందు నీ పాత్ర, జనని నచ్చిన రీతి, కన్పింప,
నేమందు, నేమందు? ప్రతిభ లింపును గూర్చ, నీ కథను
నీ ముందు, రసరమ్య భావ నీరధులుగ సమర్పింతు! 248

మధు వనమ్మున నాడు కపుల, మందలింపక, ఫలమ్ములను
ముదముతో భక్షించి, ప్రభువు మురిపెమ్మునకు పాత్ర మీవు!
అధర వనమ్మున పాదలు నస్మదీయ కవిత్వ ఫలము,
మధుర రసార్ద్ర కావ్యముగ, మన్నించి, స్వామి కందింపు! 249

'పాహి! పాహి!' యని నిన్ను – రఘు వంశ సుధాబ్ధి శశాంక!
ఇహ పరమ్ముల కెక్కు, కవితలే తపమ్ములుగ, మనస్సు
లహరహమ్మును నీ పదమ్ములందు నిల్పి, రసమయమ్ము
లూహలు, నీ కథలందు నాదుగ, తరింతు భవాబ్ధి! 250

గుర్తింపు లేవద్దు! గుండె గూడున నీ పాద భక్తి
నార్తింజెలంగి, కవిత్వయాత్ర, తపఃపథమ్మునను,
వర్తింపగా, రసరమ్య వాహినుల, ప్రతిభాత్త మతి, –
కీర్తింతు జానకీ హృదయగీతి, భవత్కథలుగను! 251

నా వంతు నే వ్రాతు ప్రభువ! నాతి మనశ్శోక ఝురిని
భావింతు ధ్వని రమ్యకథగ! ప్రతిభా మనోజ్ఞ కవిత్వ
మీవాక్కునందు రసమ్ము లీను కావ్యతపమ్ముగాగ!
నా విలక్షణ గీతి ముద్రణంబైన - కాకున్న - నేమి? 252

దూషణమ్మును, భూషణమ్ము - తొలి ప్రొద్దునే బాధపెట్టు!
రోషమ్ములును, మత్సరమ్ము - రుద్ధకంఠ గతమై పొరలు!
వేషమ్ములును, భేషజమ్ము - వేదనలను నింపునెదల!
శోషితమ్మయి, తనూపికము - శోకింప దీ, మలిసంజ! 253

బాధ నాలో వెల్లువలయి, భామినీ శోకవిషాద
గాథగా రూపొంది - తపము కవితగా, ప్రతిభాత్త భావ
నా ధునుల, రసమనోజ్ఞ నందనోద్యాన సూనములు
వేదనా మధ్యాక్కర లివి! వెల్గింపవే! స్వామి! రామ! 254

తనువెంత యల్పమ్మొ తెలియదా? నీకు! నిరతమ్ము నీదు
మనమెంత చాపల్యమూని, మాయావృతమ్మునౌ శాఖ
లను, చంక్రమణముల జేసి - లంఘించునో, ఎఱుంగ లేవ?
ఇనుమడించెను వేదనాగ్ని, యీ రెండు నొకట నన్నేప! 255

కొంచమై నొవ్వంగ తనువు - కూకటి వ్రేళ్ళతో తరువు
కుంచింప బడి, దూరమందు కూలినట్లుగ - బాధనొందు!
వంచనావశత మనమ్ము, వాడు - లోలోన, పెన్వగల!
సంచిత ప్రారబ్ధ కర్మ - నమసి పోలేదొ నాకింక?! 256

నీకు నీవుగ సరిదిద్ది నీరజాక్షి హృదయ వ్యథల -
కాకుత్స్థు రసరమ్య కథగ, కావ్య జగత్తున నిల్ప
లేకుంటి వకట! విద్వత్తు లేని లోపమ్ము తీవ్రమ్ము
నై - కవిత, ప్రతిభ యుండి, హాస్యాస్పదంబయ్యె! రామ! 257

బిరుదు లాసించి, కవిత్వ పీయూష మందింప! బ్రతుకు
తెరువు లందీవు – నా హృదయ దీప్త రసార్ద్ర రోచిస్సు
లరుదైన ప్రతిభ తోడ, జనకాత్మజా శోక చిత్తమ్ము
విరజిమ్మ – రామకావ్యమ్ము విరచింతు – తపముగా, రామ! 258

బరువైన డిగ్రీలు లేని పాండిత్య మేమొక లెక్క?
అరుదైన ప్రతిభతో, రసమయాత్మక కవిత సాగించి,
కరుణా రసార్ద్ర మహాబ్ధి – కాకుత్స్థు – కథను ధ్వనింప, –
విరచింతు జానకీ హృదయ వేదన – మధ్యాక్కరలను! 259

నా శక్తిపై నాకు శంక! 'నా ప్రతిభా ధురీ పథము –
శ్రీశక్తితో, రసార్ద్ర మధురిమలతో, రామాయణమ్ము
లాశా జనకముగ సాగునా'? – యటంచును శంక! నీ కృ
పా శారదా దృగంత రుచి – పండించునా? కవిత్వమ్ము! 260

కలుపేమొ దుబ్బులయి, వరికయ్యలందు, తలెత్తి నిల్వ –
పిలిపించి కూలీల, కలుపు పీకించినట్లు – ఎడంద
బలిసె నహంకృతి – కామ పథిని, భక్తి ఫలింపక! రఘు
కుల తిలకా! మొదలంట క్రుళ్ళగించి, తపమ్ము నిల్పు! 261

ఒడలు బడలెడి ముదిమి – మహోద్భుత వేదనాధునుల!
కడలి వోలె కలంగెడి నెద – కల్లోల భావ భంగముల!
సుడిగాలిలో నౌక వోలె స్రుక్కు, కవిత్వమన్నట్టి
పడవ! చుక్కానివై – నీవు, పద్మాక్ష! దరి చేర్పకున్న? 262

లుకలుకలు తనువు – వ్యాధి లోలోన ముదిరి గర్జింప!
వికవికలు మనసు – ప్రతిభ – విద్వత్తు లేని లోపాన!
పకపకలు బ్రతుకు – నా తపమ్ములు ఫలియింప లేక!
ఎకసెక్కెమా? నీకు ప్రభువ! హీన జీవుని నన్గనంగ! 263

ఏల? ఈ కవితా తపమ్ము, లేల? ఈ భావనా ఝురులు,
లీలగా – వేదనల కడలి – జనకజా మనశ్శోక
మూల సూత్రముగ ధ్వనించి, – ముదిమి నందు, ప్రతిభాత్త రస
హేలలై, సాహితీ జగతి, హ్రీముగ్ధ! నీ గాథ లగును? 264

నన్ను వదలదు ఈ పిచ్చి! నా గళమ్మున రసార్ద్ర ధుని,
నిన్ను కీర్తించు కవిత్వ నీరధిగ – ప్రవహించు! ప్రతి
భోన్నతిని ధ్వనించెడి తపముగ – మనస్సు నిరంతరమ్ము
నన్ను ప్రేరేపించు! రామ! నా గీతి నీ కంకితమ్ము! 265

వెఱ్ఱియూహల, పిచ్చి కలల, వేదనా మధ్యాక్కరలను
కట్టినాయన! నీ ప్రియాప్త గాథ – రసార్ద్ర రమ్యముగ,
జుట్టుకోదగు, ప్రతిభాత్త శోభా మరందధారలుగ,
ముట్టుపాలుగ – కావ్య శిల్పముల రచియింతు – నీ కృపను! 266

ముదిమిని తనువంది, మనసు మోక్షాధ్వ మందేగ కుండ
వ్యధలలో, వ్యాధిలో మున్గి, వ్యర్థమయ్యె బ్రతుకు, రామ!
తుదికి కవిత్వ తపమ్ము దొరకె – నీ పుణ్యమాయంచు!
అది రసార్ద్ర ఝురిగ, ప్రతిభ లందిన కవితగా నిల్పు! 267

డోలయై నా బేల యెద – కడుంగడు, దీనాబ్ధి భంగ
హేలయై, పైకి క్రిందికిని హ్రీముగ్ధయై విహరించు!
గేలి చేయక – నా కవిత్వ గీతా స్రవంతి – రసార్ద్ర
లోల రామకథా ఝురిగ – వెలుంగ – నీ కరుణ నర్థింతు! 268

పాండిత్య మీ వార్ధకాన పట్టమ్ము గట్టిగా రాదు!
మొండిగా ప్రతిభయే, కావ్య మూలశిల్పమ్ముగా నెదిగి,
దండిగా రసరమ్య కవిత – ధారుణీసుత శోకగాథ
పండించు నంచు నమ్మితిని! పాలింపవే! రామ! తపము 269

రాని విద్వత్తుకై, మనసు ఊపిడికి, గుటి చేయంగ
పోను! ఉన్నంత లోన, ప్రతిభోజ్జ్వల కావ్యతపమ్ము
లేను, రసార్ద్ర చిత్తమ్ములేలు భావనల నొనర్తు!
నా 'నిజాయితిని' ఓయి! రఘునాయకా! శంకింప వలదు! 270

గుహుడేమి - నిగమాగ మార్థ కోవిదుండయ్యె? నీ కెంగి
లహహ! తినిపించినట్టి - శబరమ్మ - కే విద్వత్తులందె?
సహవాసి, సుగ్రీవు డేమి సాహిత్య పీఠమ్మునెక్కె?
'నహి! నహి!' పాండిత్య' మన్న నాపైన చిన్నచూపేల? 271

బిచ్చమెత్తుట రాని నిన్ను - పేరాసతో వెంబడింప-
మెచ్చి - నాకెవరు భిక్షలుగ మేలి విద్వత్తు లీలేదు!
పుచ్చె చేగొని, బిచ్చమడుగు పుణ్యాత్మ, శివుని, వెన్నంటి -
తెచ్చుకోగలను! పాండిత్య దీధితి - ప్రతిభతో కవిగ! 272

సగమయ్యె నా కావ్య తపము! సారస్వతాభిమానులకు
సొగసుగా రుచియించు, ప్రతిభ చొప్పడు, రసరమ్య రచన -
పెగలదీ గళమందు! జనని ప్రేరణ - వ్యుత్పత్తి లేని,
'దగులుబాజీ'ని - వరింప - తపమెట్లు ఫలియించు? రామ! 273

పెద్ద కొడుకవు! దశరథ పృథ్వీపతికి, జనకునకు
పెద్ద యల్లుండవు! ప్రణయ పీయూష లహరి - సీతమ్మ
కొద్దికైన మగండవు ! ప్రతిభోజ్జ్వల కావ్య తపమ్ము
లుద్ధరింపుముర! వైదుష్య మొసగి, - కృపాంభోధి వగుచు! 274

ఆనందవర్ధను శాస్త్ర మా కంఠముగ క్రోలలేదు!
ఏ నాడు ఛందస్సు కవితకే, ప్రాణమంచని, యెంచ!
శ్రీనాథ కవి సార్వభౌమ శిల్ప మౌపోసన చేయ
పోను! నీ కృపయె, నా కవిత పోషించు నంచెంతు! రామ! 275

ఈ పాడు దేహమ్ము రుజల నీ రీతి నిరతమ్ము క్రుంగి
ఆపాడు నెడద, తద్వ్యాధి - అట్టు చేయంగ భావాబ్ధి!
ఏ పగిది తపమ్ము - ప్రతిభ లేలెడి కవితగా వెలిగి,
నా పాడు బ్రతుకునందు, రఘునాథ! నీ కథలుగా నిల్చు? 276

ఒకనాడు ఉదరమ్ము, మఱియు నొక్కొకనాడు శిరమ్ము
వికటింప - తనువు, వేదనల వేధింపగా మనమ్మెటుల
వికచాబ్జ నేత్ర! యెడంద, వేదనా ధునుల రసోజ్జ్వ
ల, కథా సుధా ఝురుల - నెటుల - కవిత్వ తపము కావింతు? 277

మాటి మాటికిని వ్యాధులవి, మనసందు, తనువందు, నిలిచి, -
ఏటికెదురు ఈదినట్లు - ఈ ప్రతిభాత్త కవితల,
బోటి వేదనల - గాథలుగ - పూనగా నౌనె తపమ్ము?
ఆటుపోటుల మధ్య - రామ! ఆగిపోవునా? బేల గుండె! 278

తనువు తిన్నగ నుండ బోదు! తద్గతమ్మైన వేదనల
మనసు నిల్వంగ పోదు! రసమధుర కవిత్వ తపమ్ము
వనితా హృదబ్ధి ఘోషలను వాగర్థ రమ్యగాథలుగ -
వినిపించునా? రామ! ప్రతిభ విచ్చిన, కావ్య గానముల 279

ఏదియో ప్రతిభ లీయెదల నింపైన రసమాధురులను -
గాథలుగ, కవిత్వ ఝరులుగా, జనకాత్మజాహృదయ
వేదనలుగ - ధ్వనించునని - వేచియుంటినిర! యిన్నాళ్ళు!
నీ దగు కృప చూపి, కవిత నిర్దుష్ట రచనగా నిల్పు! 280

ఉయ్యాలగా నా యెడంద - ఓ హృదయాధినాథుండ!
ముయ్యేఱులై, నా రసార్ద్ర ముగ్ధ కవిత్వ తపమ్ము -
కయ్యలై, మత్ప్రతిభాత్త కథన, సస్యఫలమ్ములంది-
అయ్యా! కృపాంభోధి! ధ్వనుల నానందడోల, నీ వూగు! 281

సుఖ దుఃఖములు ఎదలందు చుట్టాల చూపుగా వచ్చి -
ముఖమంచు కవితా తపమ్ము - మధుర ప్రతిభతో, రసార్ద్ర
సుఖగాన లహరి - వైదేహి శోకవాహినిని - నీకథగ -
'దఖలు' చేత మటన్న - ఎఱుక దక్కక - విలపింతు! రామ! 282

కౌసల్య, వాత్సల్య జలధి - కమనీయమౌ జోలపాడె!
దోసిలొగ్గుచు కౌశికుండు, తొలి మేలుకొలుపు సృష్టించె!
లేసిగ్గుతో సీత, - పవ్వళింపుల సేవ లొనర్చె!
వాసిలో, రాశిలో - తక్కువయ్యు - కీర్తింతురా! రామ! 283

ఆ తల్లి పాటలే జోలలై - రామ! నిద్రించినావు!
సీతమ్మ లాలింపు - ప్రణయ శీథువై మత్తిల్లినావు!
నీ, తమ్ము - ప్రార్థనాగీతి - నిల్పు కొన్నావు, ప్రాణముల!
నాతపము - ప్రతిభాత్త కవనమ్ముగా - స్వీకృతిన్ కొనవె! 284

నీ యంద మేమందు? నీల నీరదాకార! నా తల్లి
నీ యందు, తొలిచూపులోన, నిల్పెనో ప్రణయామృతమ్ము?
మీ యందు నాభక్తి - యెదల మీదులు గట్టి, తపమ్ము
లా యిందువదన హృదయ రసార్ద్ర కథలుగా ఫలించె! - 285

ఏమయ్య? హనుమయ్య! రంగమీవు ప్రవేశించి, హృదయ
ధామమ్ములన్ రసార్ద్ర మధు ధారలే విరియంగ, కవిత,
నా, మానినీ, శోకగాథ - నప్రతిమాన ప్రతిభల -
రామాయణమ్ముగా నిల్పి - రంజింప జేయకపోవు? 286

నీవు తోడైనావు! హనుమ! నీరేజనేత్ర, శోకార్ద్ర
భావసాగర తరంగముల - బంధుర రామాయణమ్ము
గా వచింతు, ప్రతిభాత్త రస కావ్యమ్ముగా, ధ్వని జలధి
లో విహరింతు, నటంచు - లో దలంప, - ఫలింప దేమి? 287

వెనుకంజ వేయకే, - సీత వెదకు మంచన్న దూకితివి,
వనధి! సీతమ్మ నందరసి, స్వామి కా వార్తనే నుడివి,
వినుతింపబడితివో, హనుమ! విసిగి వేసారినట్టి - నను
కనికరించి, కవిత తపముగా ఫలింపగ - కావవేమి? 288

నీ వీర రసగాథ, హనుమ! నిరుపమానమ్మంద్రు! నన్ను
నీ వానిగా తలంచి, రస నీరధిగ కవిత్వ తపము -
శ్రీవారిజాక్షి శోకార్ద్ర చిత్తమ్ము తెల్పు గాథలుగ -
నా వాక్కు ప్రతిభతో నింపి, నా తండ్రి! కావవే! కృపను! 289

వెనుక ముందులు, త్రొక్కిళులయి, విసుగయ్యె మనసు శోకాన!
వనిత విషాద గాథలను, వర్ణింప రసరమ్య కవిత,
వెనలేని ప్రతిభ - నా స్వామి కేమొ? కరుణ గల్గదయ్యె!
హనుమ! నీవైన రామన్న నర్థించి, తపము పండింపు! 290

కపిరాజు - 'కామార్థి మున్గి, కాంత నన్వేషింప బూన
కపరాధియయ్యె' - నటంచు నల్గె రామన్న - కిష్కింధ!
కపివోలె నామనము, రసకావ్యసృష్టి - తపమ్ము చేయ
కపరాధి యయ్యె! మన్నింపు మనుచు - నీవైన వచింపు! 291

తార - సాంత్వన వాక్య మధువు త్రావి - శాంతుండు సౌమిత్రి!
ధీర చిత్తుండు, సుగ్రీవు - దీన ప్రార్థనము మన్నించి
తేటితో స్వామి! కోపమ్ము తీరి! ఆ రీతి నాయందు
కారుణ్య మొలికి - రసార్ద్ర కావ్యమ్ము - తపముగా నిల్పు! 292

నా పాప మేమిరా? నళినవయన! నీ కాంత శోకమ్ము
లాపగలుగ, రస రమ్య హాస లహరులుగ - ప్రతిభ
తో - పలుకంగ, నీకథగ - తోడేమి రావు? నా తపము
లే పగిది ఫలియించు? ధ్వనియించు - రామాయణమ్ముగను? 293

కేవల మ్మొక్క ప్రతిభయె – కీర్తికేతన మెగురంగ
పోవనీయదు! సంప్రదాయ పూర్వకమ్మైన పాండిత్య
మీ వచఃసుధల నంది, ధ్వనియింప రసార్ద్ర కావ్యమ్ము,
భావనా మధురమై – తపము పండునా? నీదు కరుణను! 294

ఒడలు బడలెనయ్య! యోగి యోగేశ్వరా! రామచంద్ర!
తడబాటు హెచ్చయ్యె నెడద! తల్లి మనశ్శోకగాథ –
నుడులలో, ప్రతిభా మనోజ్ఞ నూత్న రసార్ద్ర కావ్యముగ,
కడతేర్చ లేనైతి! తపము కవితగా – ప్రారబ్ధకర్మ! 295

గానుగెద్దును వోలె, నేను గాడి తప్పక పోవుచుంటి!
జానకీ హృదయార్ద్ర శోక సాగర మేను, నీకథగ –
శ్రీనాథ! రసరమ్య కావ్యశిల్పమ్ముగా రచియింప
పోనయ్య! నీకృపా జ్యోత్స్న – పూర్ణమ్ముగా నిల్పుమెడద! 296

ఎన్నండు నిస్పృహా జలధి నీదులాడుచునుందు రామ!
మిన్నంది కవితా తపమ్ము, మేదినీపుత్రి – విషాద,
మున్నంత ప్రతిభతో, ధ్వనుల నుప్పొంగు రసరమ్య కథగ –
చెన్నొందు – నీకృపా ధునుల జిందించి, రక్షింపు! స్వామి! 297

కాలమ్ము విలువ లీనాడు కళ్ళకున్ గట్టినట్లయ్యె!
లోలాత్మ నిన్నాళ్ళు – ఇహమె – లోకమ్ముగా విహరించి,
శ్రీలాస్య హేలామనోజ్ఞ శిల్పమ్ము, కవితాతపమ్ము
లేలంగ, – నీగాథ – రసము లింపొంద రచియింప నైతి! 298

వెనుకకు త్రిప్పంగ నౌనె? విధియన్న ఘటీయంత్ర గతిని?
మనసు నిల్పంగ నాకౌనె? మర్యాద రామన్నపైన?
జనకాత్మజా హృదయార్ద్ర సాగరఘోష – కవిత్వ
మున – రసార్ద్ర మనోజ్ఞ కథగ – ముద్రించు, తపము నాకగునె? 299

ఛందః పథమ్మ నిర్దుష్ట సమ్యక్పథమ్మనై వెలిగి,
అందాల జిందు రసార్ద్రమైన కవిత్వ తపమ్మ –
సుందరీ కరుణార్ద్ర హృదయ శోకాబ్ధిగా, ప్రతిభా ప్ర
బంధ కావ్యమ్మగా నిల్చి, భాసిల్లనే? తెన్గునేల! 300

నా వల్ల కాదయ్య! నళిననయనా! తపమ్మగా కవిత,
లా, వారిజాక్షి శోకార్ద్ర హాలాహలమ్మలన్ జిందు
భావాబ్ధిగా ధ్వనింపంగ! బంధుర ప్రాతిభా ధునులు –
నీ వల్లనే – రసకావ్య నీరధులై వెలుగొందు! 301

నా నిమిత్తమ్మగా – కవిత – నా తండ్రి! రఘునాథ! నీవు
జానకియు – హృదంతరాన, సాహిత్య పీయూష ధునులు
గా నలరంగ – ప్రేరణల గావించి, పోషింప – తపము
లీ నాడు – రసరమ్య కృతుల నింపు దలిర్ప సృష్టించు! 302

మథియింప, మథియింప, క్షీరమాధుర్య హృదయవారాశి, –
వ్యథలుగా, హాలాహలమ్మ వ్యాపించె కవితా మనోబ్ధి!
పృథివీ సుతాభర్త నీవు! వృషభాధి రూఢుడా శివుడు!
కథలుగా తిలకింతురేమి? కదలరా? సుధలతో ప్రోవ! 303

ఊరకే మ్రింగి కూర్చుండె నురగహారుండు, భవుండు!
తేరగా దక్క – శ్రీలక్ష్మి – దేవేరితో కుల్కె హరియు!
హొరుగా సందేహ విషమహా! తలకెక్కి కవితల
'జోరు' అణంగ – నిర్వ్యాజును – చూతురేమయ్య? నిర్దయగ! 304

దక్షిణామూర్తి, యాచార్య దాక్షిణ్య మలవిగానట్టి
శిక్షా స్మృతిని తెల్పి, కవన శిల్ప ప్రతిభ వెలిగించు!
అక్షీణ కారుణ్య మూర్తియౌ, రాఘవస్వామి – రసము
లక్షయమ్మగ నిల్పి కవిత లానంద ధునుల నానర్చు! 305

ప్రాచీన సంప్రదాయమ్ము పాటించి, విద్వత్తునంది,
నే చేయనైతి తపమ్ము! నీరేజనేత్ర! నా ప్రతిభ
పై చేయిగాగ – రసార్ద్ర భావ లహరుల సృజించి,
నీ చెలియ విషాద కథను నే చెప్ప – తప్పయ్యె! రామ! 306

నన్ను మన్నించుమో రామ! నాతప్పులన్ దిద్దు ఎఱుక
మున్నుగా నీ కృప నంది మోహరింపక, కవిత్వముల –
నన్నులమిన్న శోకమ్ము లత్యంత ప్రతిభాఢ్యమందు,
చెన్నుగా శ్రీరామకథగ – చెప్పబూనితి, – నయ్య! మరల 307

ప్రతిభతో, – విద్వత్తు కప్పి – రామకథా సుధలను – క
వితగ్గా, రసార్ద్ర గాథలుగ, విన్పింతునంచు – శ్రీరామ!
జతనమ్ము, తపముగా చేయ – జన్మాంతరంబైన విధికి –
బ్రతుకు లోకువగుచు, కవిత రాణింప దయ్యె నీ నాడు! 308

ధారతో, ప్రతిభతో, భావదార్ఢ్యమ్ముతో, నూహతోడ –
నీ రమణి వగపు లెదల నిండంగ, రచియింతు – రసము
ఖారించు ధ్వని కావ్యమనుచు, నుబ్బితి – నవివేకినగు, చ
పార కృపాధార లేక – పండునా? తపము! శ్రీ రామ! 309

ఆర్తి యొక్కటి చాల, దధికమైన భక్తి రసార్ద్రతలును,
స్ఫూర్తి నొసంగు ప్రతిభయు, సుందర భావనా గరిమ,
మూర్తిమంతమునైన, ముగ్ధ మోహనమైన విద్వత్తు –
కీర్తు లందించు గాని – కవికి – మఱెట్టి మార్గమ్ములేదు! 310

ఎట్టులైన కవితలో పేరు, ఈజన్మ కికలేదు! రామ!
కటువైన నిజమిద్ది! గరళ కంఠుం డగుచు మ్రింగెదేను!
పటిక బెల్లము, తేనె, పాలు – ప్రతిభ లంచని – భక్తిరసము,
లటుకులుగా చేసి – నీకు నందిత్తు కవిత! చేకొనుము! 311

పుటమేసి, పుటమేసి, ప్రతిభ – పూర్ణేందు వదన శోకమ్ము, –
స్ఫుటదరుణార్క శోభా ప్రపూత కవిత్వతపమ్ము –
పటు రసధ్వనులను, రామభద్రు కథగ – వినిపింతు!
నటశేఖరా! శ్రీరఘువర! నన్నుకావర! కృపాజ్యోత్స్న! 312

కళ్ళున్న వని నేను మిగుల గర్వించి, – సౌందర్య హృదయ
మేళ్ళుగా, రస ధునులుగను, – ఏణాక్షి శోకార్ద్ర కథను,
కళ్ళలో వత్తులిడికొని, కాకుత్థ! ప్రతిభా స్రవంతి,
సుళ్ళుగా దిరిగి, తపమ్ము శోభిల్లగా లేక వగతు! 313

సర్వాంగముల నీకు సేవ సరిగచేయంగ దలంప –
గర్వాంధ కారమ్ము లెక్క, కనులలో పొరలట్లు గ్రమ్మ –
నిర్వాక్కు నౌదురా! రామ! నీకృపాజ్యోత్స్న లొల్కించి,
పర్వమ్ముసేయు మీ నయన భాగ్యమ్ము – నిన్గాంచు వరము! 314

వినికిడి, నిను కనియెడి, వివేక నయనములును, నుడు
వను – శుద్ధిచెందిన, మధుర వాక్కును, భక్తి మరంద
మును గ్రోలు మనసను భృంగమును – కవితాతపమ్ములను,
జనకజ గాథల వినుచు – సత్ప్రతిభ నొసంగు రామ! 315

ఛందమ్ము, వ్యాకరణమ్ము, శాస్త్రార్థ బహుళ పాండిత్య
మందమ్ముగా పొందు పఱుప – నలవిగానట్టి – కవినని –
డెందమ్ములో కిన్కయా? గడిందిగ నీ కృపామృతము
చిందింప – ప్రతిభాత్త, రసవిశిష్ట – రామకథ, సృజింతు! 316

ఏయవయమ్మైన ఒకటియే యనిపించు! – వ్యాధులను
మాయా మహాపంజరమున గ్రుగ్గి నన్నాళ్ళు! – కాదేని, –
ఈ యొడలు నవయు, – మనసు లేవేవొ, చింతా స్రవంతు
లై – యవశమ్ములై – బ్రతుకు నందు నిరాశ నిండించు! 317

కన్ను ముఖ్యమ్మని, కంటి కన్నను దేహ దార్ఢ్యమ్మ
మున్నుగా నుండవలెనని, ముదుసలి తనమున - బుద్ధి
యన్నిటికన్న నెక్కువని, ఆలోచనలు ముదిరి - మది
తిన్నగా నుండదో రామ! తీర్పు నీకే వదలెద! 318

ఏ యంగమైన నేమయ్య? ఈశ్వరార్చన కన్ని యమర,
నా యంగమున కున్న పనియు నదియు చేయంగ వలె గద!
ఓయయ్య! రామయ్య! కవిత లొప్పంగ నీ నాతి కథగ -
నీ యపార కృపాఝురులను నిల్పు - సర్వాంగముల - ప్రభు! 319

నీ తోక పట్టుక వత్తు నిష్కల్మషమ్మైన భక్తి
నో తండ్రి! హన్మ! నాకవిత నుజ్జ్వలప్రతిభా పథమ్మ
లో- తల్లి వేదనా ఝురుల, లోకోత్తరమ్మైన కథగ -
సీతా మనశ్శోక గాథ - చిత్రింప నిమ్ము కావ్యముగ! 320

నీ నామ జపమున - రుజలు నిర్మూలమౌనంట! హన్మ!
ఏనాటికైన సాధనకు, ఈవె యాచార్యుడేనంట!
నానాటి కధికమౌ, యాతనాబ్ధి తరంగాల ధాటి -
నే నోపుటెట్లురా? పావనీ! నీవు తోడుగా లేక? 321

తప్పు లిన్నాళ్ళు చేసితిని! తత్త్వమ్మ లోగుట్టు తెలిసి
నప్పటినుండి, దిద్దుకొన యత్నించుచున్నాడ! హనుమ!
ఒప్పుల కుప్పదౌ, వేదనోద్ధృతగాథ - ప్రతిభల, -
మెప్పింతు, రసరమ్య కథగ! మీ కృపామృతపానవశత! 322

నయన ప్రధానమ్మునైన నా కవితా తపమ్మునకు -
లయలుగా సౌందర్య దృష్టి లభియించు నంచాశ పడితి!
వయసుడిగె ననుచు వగవ! వాడియౌ, వేడియౌ చూపు -
భయముడిప్పి, నిల్గాంచు నట్టి భాగ్యమ్ము - కల్పించు రామ! 323

తను మనమ్ములు కోలుకొనుచు, తల్లి, మనోవేదనలను,
ఇనకులోత్తము గాథలుగను, ఎసగు కవిత్వ తపమ్ము
లను – రసార్ద్ర ఝురులు – ప్రతిభలను, కావ్యావార్ధులౌచు, – జగ
మున – వెలుంగ, భవత్కరుణను – ముగ్ధ మోహన రామ! నిల్పు! 324

చేతులు కాలినవెన్క – చేర్చెద నాకులన్ నేను!
గోతిలోపడుచు నా పిదప గోలవెట్టెద, చూపునిల్వ!
ఖ్యాతికై యవకాశ మొదుగ – కాదంచు, నావెన్క వగతు!
సీతమ్మ! నీశోక గాథ చిత్రింప లేనట్టి వ్యధలు! 325

బ్రతుకు – చీకట్ల వెల్లువయి, – భ్రష్టమై కవితాతపమ్ము –
అతుకు బొంతగ, జీవనమ్ము లంతంత మాత్రమై నిల్వ –
సతి, మానసాంభోధులందు, చలియించు శోక తరంగ
గతులు – రసార్ద్ర మనోజ్ఞ కావ్యమ్ముగా వ్రాయుటెట్లు? 326

ఇంత నిరుపయోగమైన యీపాడుబ్రతుకు బాటలను,
కాంతా మనశ్శోక జలధి, – కావ్యాంతరంగమై – ప్రతిభ
లెంతయో కొంత, రసమ్ము లింపుగా గూర్ప – నీ గాథ
నెంతైన రమ్యముగ రచియింతు నంచు తలంతు రామ! 327

అపరంజి నా ప్రతిభ! మఱియందు వైదుష్యమే సున్న!
అపరాధ మది యెట్లు సరిగ నౌనన్న – తపమన్న కొలిమి –
నపరంజి, రాగితో కలిపి, అత్యుష్ణ భక్తితో కాచి,
సఫలమ్ము చేతు నా కవిత – సరసాభరణ రామకథగ! 328

ప్రతిభ లేదని కాదు! నీదు పాండిత్య గరిమ లెంతయని,
మతిలోన 'బేరీజు' వేయ మనసాయెనా నీకు? కవిత
లతిలోక రమణీయ, రసమయాత్మక పద్యకావ్యమ్ము –
సతి శోకగాథగా, రమ్య సాహిత్య సృష్టిగా నగునె? 329

ఏదొ పొగరున – నీ ప్రతిభ లేకొంచెమో వెలుగంగ –
ఆదికవి కృత రామకథ – నానంద వార్ధిగా నెంచి,
శ్రీదేవి శోకార్ద్ర రస విశేష స్రవంతుల, పద్య
మాధురులొల్కు – కవిత్వమార్గమ్ము – తపముగా తలతె? 330

ఒకటి వెంటను వేఱొకటి, మహోద్ధృతంబైన వేదనలు
ప్రకటమ్ముగా తనూలతలప్రాకి, – కవిత్వ ప్రసూన
మకట! రససుగంధ లహరు లందింపనీక – శోకమ్ము
లొకటియే నిల్వ – నా ప్రతిభ – యోషామనోగీతులౌనె? 331

తనువులేమొక యింత, మనసుదార్ఢ్యమ్ము లొకయింత, కలగి, –
మనలేక, కనలేక, రమణి మానస వ్యథల, – కవిత్వ
మున – ప్రతిభలను, రసార్ద్రముగ విలసిల్లనీక – వగ
పున క్రుంగెదేను! ప్రభువ! తపోజ్జ్వల ప్రగతి నందింపు! 332

నే నెదుగు సమయాన, కమనీయ పద్యకవిత్వసార
భానీత వాహిను లొలుకు, ప్రతిభాత్త విద్వత్తరంగ
మీ నేల, రసగంగ జేసె! ఈ యర్భకుం డెదిగి, – కవి
గా నిల్చి – రచియింప – పద్యకవితకే గ్రహణమ్ము పట్టె! 333

వచన కవిత్వాన, నాది – వార్ధక్య దృష్టియే యనుచు, –
రచనలో సామాన్య జనుల రంజింపగా చేయునట్టి
రుచులు – సంస్కృత సమాసభర, రుగ్మతల ప్రసరించునని –
వచియింతు రాధునిక కవివరులు – విమర్శకులగుచు! 334

మంటిలోపొరలి, సామాన్య మానవ జీవన ఝురుల, –
మింటిపై కెగసి, పూర్వాంధ్ర మేరుశృంగమ్ములౌ కవుల
జంటగా – ప్రతిభా మనోజ్ఞ సారస్వతమ్ము – సృజింప!
రెంటికిన్ చెడిన రేవడను! రిత్తయ్యె, కవితా తపమ్ము! 335

పాండిత్య మొకయింత, ప్రతిభ పట్టనియంత నా కొసగి -
గుండెలో కూర్చుండి, ప్రేరకుడ వగుచు - జనని వగపు
మండింప భావనా ఝురుల - మధురమై కవితా తపమ్మ
పండెరా! రామ! నీగాథ ప్రాక్తన జన్మ పుణ్యాన! 336

మధ్యాక్కరల పైన నాకు మక్కువెక్కువ! మధురిమ - స
హృద్యాయి గాగ, రసధునులై, ప్రతిభాఢ్యమై, - కవిత,
లధ్యయనమ్ములౌ, ధ్వనిమయాత్మక రమ్య గాథలుగ -
నీ ధ్యాన నిష్ఠలో, తపము, నే జేతు! నీరజాతాక్ష! 337

అధ్యాపకుడ నేను గాను! ఆర్ష విద్యా విధానమ్మ
లధ్యయనము చేయబోను! యాంత్రికమ్మైన వృత్తుల - ప
రధ్యానమున మున్గి - కవిత - రసరమ్య ప్రాతిభాఢ్యముల
స్వాధ్యాయ నిరతితో రామ! సాగింతు తపము - నీ కథగ! 338

మొద్దునై, యజ్ఞాన తిమిర మోహితుండనయి, సంజకడ
బద్ధకమ్మ వదలి, ప్రతిభ భాసింప, రసరమ్య కవిత,
నద్ధరిత్రీ సుతా మానసాంభోధి పొంగు, శోకమ్మ
'అద్ధా!' - యనంగ రచింప నగునె? నీ రామాయణమ్మ! 339

ఎద్దియో ఆశ - నాయెడద, నించుకంత ప్రతిభ వెలిగి,
ముద్దియ, సీతమ్మ, శోకముగ్ధ రసార్ద్ర గాథలను,
శుద్ధ ఛందోబద్ధ పద్య శోభాకృతులౌ - రచియింతు
నద్ధరిత్రీ సుతానాథు నవ్యాజకారుణ్య మహిమ! 340

తనువు వ్రాలెడి దన్క, మనము తాత్త్వికచింతనములను,
తనివి చెందెడి దనుక, - కవితా తపమ్మ, రసమయమ్మ
గ - నళినాక్షి విషాదకథను, కమనీయ ప్రతిభా పథమ్మ
నను - భక్తికావ్యమ్మగాగ - నడుపవే! శ్రీనాథ! కృపను. 341

ఇల్లు వాకిలి నూడ్చి, అలికి, యిల్లెల్ల ముగ్గుల దిద్ది,
చల్లి, – నవ్వుల పువ్వులన్ని – స్వాగతము నెఱప – మదిని –
పుల్ల సరోజనేత్ర! అతి పూత మొనర్చి, వాకిళ్ళ, –
కళ్ళు విచ్చుక, నిరీక్షణల, గడపె, – దతిథిగ – నిన్గొల్వ! 342

వాసనావృత జీవితమ్ము వదలించుకోలేక, తపము
గా – సనాతన ధర్మపథుని – కాకుత్స్థ! నీగాథ, ప్రతిభ
వాసింప, రసరమ్య గీతి వర్ణింతు; భక్తి తత్పరత!
ఈసారితో జన్మ కంత మీ విచ్చి, వెల్గింపు కవిత! 343

పాప, పుణ్యము, లేక సూత్ర బంధనమ్మున కల్గుననుచు,
ఆపగారాని తలపు – రసార్ద్ర కవిత్వ నిర్ఝరిగ –
నీపదాంబుజ భక్తి నిల్పి, నీరజాక్షి విషాదకథను –
శ్రీపతీ! ప్రతిభతో రమ్య శిల్పమ్ముగాగ, అర్పింతు! 344

బండి కదలు నంచు, బ్రతుకు బరువు తీరుననుచు – మనసు
నిండ కవిత్వమ్ము ఫలము – నీకు నైవేద్య మిత్తునని –
దండి ప్రతిభ చూపి, కావ్యతపము చేసితి, నిరీక్షణగ!
బండి నన్ను విడచి వెళ్ళె – పాపయాత్రల నొంటి దిరుగ! 345

మిగిలిపోతిని – 'రైలు' నెక్కు మేటి తెగువలేక! – 'లేట'
నగ – నొక జీవిత కాలమైన నెట్లు? బ్రతుకు తెరువు
వగపు బండ్లను నిండి యుండె! వార్ధక్య జీవనరథము
నొగల, సారథిలేని యట్టి నూత్న మర్యాదను నిల్పె! 346

పేరువద్దు! తపమ్ములంచు పిలువవద్దు కవిత్వపథము!
నోరు మెదుపగానె – వగపు – నూత్నశోకరసార్ద్ర ఝురిగ,
పాఱు, నెడందలోతులను! ప్రతిభ యుండియు పండనట్టి –
భీరు, కథా కథనమ్ము బీడువట్టె! నిరాశమిగిలె! 347

పేరు, ప్రఖ్యాతులే లేవు! పెంపులే లేవు! కవిత్వ
పారిజాత వనమ్ములందు - పరిమళింపగ పోవు - ప్రాతి
భా రమణీయ సూనములు! భారమయ్యెను జీవయాత్ర!
సారహీనమ్మైన బ్రతుకు చాలురా! రామ! నాకింక! 348

అహము లజ్ఞానమ్ము లెడల నావరించిన వేళ, శాస్త్ర
సహిత పాండిత్య మెఱుంగ జాలినట్టి - వివేకభావ
రహితుడ! కవితా తపమ్ము - రామ కథాకథనమ్ము
లిహపరమ్ముల గమించునని, - యెండమావుల - మునింగితిని! 349

నిగమ రహస్యమ్ము లెఱుగ! నిష్ఠతో విద్వత్తునొంద!
ఎగయు భావావేశ ఝరుల, హ్రీముగ్ధమౌ ప్రతిభలను -
సొగసుగా, రసరమ్య కవిత - శోకార్ద్ర గాథ విన్పింప -
నగుబాటులే మిగిలె! రఘునాయకా! వ్యర్థమై తపము! 350

ఎంత యేడ్చిన నేమి? కవిత లీ రీతి, పాండిత్య గరిమ
లింతయైనను లేక, ప్రతిభ లెంతయున్నను - రస రమ్య
కాంతులెంత విరిసినను - ప్రకాశమ్ము లొందునా? తల్లి -
స్వాంత మీ, మూఢు కందెడినె? వ్యర్థమేనా? నా తపమ్ము! 351

ఒకసారి యువ్వెత్తుగా, మహోదధివోలె నుప్పొంగు -
సుకవితా రమ్య భావాబ్ధి - సుదతి మనో శోక కథల!
ఒకసారి యణగారి, వగపు లొక్కపెట్టున ఝుంఝులౌచు,
వికల మనోరథ జలధి - వ్రీలు - నైరాశ్య భంగముల! 352

ఆటు పోటులు నైన మనసు, లాలనా పాలన లేని
కౌటిల్య భూయిష్ఠ జలధిగా, పరిణామమొంది, మన
సోటమిని వరింప - ప్రతిభ లుజ్జ్వలమైన కవితల -
బోటి గాథను, రస రమ్యముగ సృజియింప నెట్లోను? 353

ఉడుకు రక్తము పొంగి, యౌవనోదయవేళ, కామమ్ము
లొడలెల్ల పండించు, ప్రణయ ముప్పైన యైన ఫలమ్ము!
ఉడుకు తగ్గిన వేళ, వార్ధకోదయ కాలప్రభావ
మడరి – సన్న్యాస, వైరాగ్య మలరు, దాంపత్య మందైన! 354

మగ మహారాజు నే ననుచు, మగసిరి, మీసమ్ము దువ్వి –
పొగరుతో వయసందు ప్రొద్దుపుచ్చితి, వ్యర్థ చింతనల!
వగలతో వార్ధక్యవేళ, పంజరస్థ శుకమ్ము నగుచు, –
మగటిమి, పరమాత్మ! నీది! – మగువ – నేనను, – తెల్వి మిగిలె! 355

పరతంత్ర భావమ్ము, – జీవి బ్రతుకున నే ప్రొద్దు, – మనను
కెఱుకకు వచ్చు, – దా నొక్కడే జగతిని సంచరింప;
జరుగదటంచు! స్వాతంత్ర్య సార్వభౌమత్వమో? దొడ్డ
దొరవైన నీకే – తగునుర! తోయజాక్ష! సుకల్పవృక్ష! 356

'క్రాసురోడ్డు' ల మధ్య నిల్చి – కవితా పథమ్ము – చూచాయ
గా – సుకవి జన పథానుగామిగా, ప్రతిభాత్త పథిని,
శ్రీసతీ శోక రసార్ద్ర చిత్తాబ్జ సౌగంధ్య వీథి –
నే, సాగగా, తపమ్ములను – నీకృప – కన్నీళ్ళు మిగిలె! 357

మెచ్చిన నాకేమి? జనులు మెచ్చకున్నను – చింతలేదు!
'అచ్చులో చూడనే?' యన్న, ఆతుర పడు టేమిలేదు!
మచ్చెకంటివి నీవు! నాదు మనసులో వేదనా జలధి,
ద్రచ్చి – కావ్యామృతమ్ము – రస రమ్య తపముచేయ, – చాలు! 358

అమ్మ యే ప్రేరణమ్ము! జనకాత్మజాధవు, డయ్య! కనిక
రమ్మును చూపు! హనుమ – కరమ్ము నందించు! కవిత – త
పమ్ముగా, ప్రతిభామనోజ్ఞ భావమ్ము – మధ్యాక్కరల – ర
సమ్ము లొలుకు, వేదనలు, – వశమ్ము చేతు – సహృదయులకు! 359

అద్వైతి నేనైతి! శంకరాద్వైత భాష్యమ్ము లెడద,
నద్వైత భావ మూలమ్ము లగుచు - శ్రీరామ కావ్యమ్ము -
సద్వైభవాభిరామమ్ము, సాకార, నిర్గుణ రూప,
చిద్వైభవమ్ము నగుచు - రచింతు, జనని వేదనలుగ! 360

* శ్రీలాస్య హేలావినోద! సుకవితా శ్రీమత్స్వరూప!
కైలాస గిరినాథ, పద్మభవ, సురగణ సేవితాధ్వ!
కాలాహి ఫణిఫణా నృత్యలీలా వికాస పదాబ్జ!
కేళీ జగత్సృష్టి కార్య దీక్షా ప్రకీర్తితానంద! 361